# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)



అక్టోబరు 1974

సంపుటము : 51 : సంచిక : 10 :

విడిపత్రిక వెల రూపాయిన్నర

ఆవేశం బంధాన్ని తెంచితే ఆలోచన కన్నీళ్ళలో మలించుతుంది.



సురేష్ మూవీస్

# చక్రవాకం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత:
**డి.రామానాయుడు**

దర్శకత్వం:
**వి.మధుసూదనరావు**

కథ ఆరికెపూడి (కోడూరి) కౌసల్యాదేవి

రచన. ఆచార్య ఆత్రేయ

సంగీతం కె.వి మహదేవన్

కెమెరా: మార్కస్ బార్ట్లే

విడుదల
ఆంధ్ర సీడెడ్
**నవయుగ ఫిలింస్**
నైజాం
**విజయా సురేష్ పిక్చర్స్**

NYKR

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1974



———

విజయదశమి శుభాకాంక్షలతో




విజయవేళంగని పిక్చర్స్ సమర్పించు

# పెళ్ళిపందిరి

కథ. మాటలు. స్క్రీన్‌ప్లే. దర్శకత్వం
దాసరి నారాయణరావు

సంగీతం
స. రాజేశ్వరరావు

నిర్మాత
తుమ్మా మర్రెడ్డి

నటీనటులు

చంద్రమోహన్... మురళీమోహన్... రాజబాబు... సత్యనారాయణ
అల్లురామలింగయ్య... ప్రభ... రాజసులోచన మొదలగువారు.......
మరియు నూతననటుడు ముత్యాల నాగేశ్వరరావు.

# వీధి మానిసి స్వీయ గాథ

శ్రీ దాశరథి

ధగ ధగ మండే సూర్యగోళమును
తలపై నేనే మోయాలా?
జగతిని జలముల ముంచే జలదుని
సైతం నేనే మోయాలా?
తలపై ఆచ్ఛాదనయే లేని
తపసిని నేనే కావాలా?
రోడ్డు పక్కగా యెల్లకాలము
గొడ్డులాగ జీవించాలా?

పాదచారులు పయనంచేసే
పథమే అయినది నా యిల్లు
వానకు యెండకు తడిసీ యెండీ
బండవారినది నా వళ్లు
వీధి జీవితం, వృథా జీవితం
విషాద గాథా కలిత జీవితం
అశ్రుధారలో తడిసిన హృదయం
అనద బ్రతుకులకు ఐనదంకితం

చీకటియే నా శయ్యాసదనం,
జాబిలియే నా ప్రేయసి వదనం
తారల జరీబుటా పనిచేసిన
ధారాధర పథమే నా వసనం
నగ్నత నైచ్యమనే నాగరకులు
అగ్నికి చేలం కడతారా?

భగ్నజీవుల రుగ్ణతచూచి
పకపకమంటూ నవ్వేరా?

కట్టగుడ్డయే లేని వారికి
గుట్టూ రట్టూ యెక్కడిది?
చింకి పాత నోచని జీవులకు
సిగ్గూ యెగ్గూ యెందుకని?
సంస్కృతి పేరిట చచ్చు సమాజం
సవాలక్ష కథలల్లింది
సభ్యత పేరిట తన గొప్పదనం
జగాన బాగా చాటింది.

వీధిమానిసీ! గడచులేని సి!
బాధాతమమును విడనివ్వు
గుండెల కొండల చాటున దాగిన
నిండు సూర్యునిటు రానివ్వు
సుప్రభాత నవ సుప్రజా నటన
సూత్రధారివే ఇక నువ్వు
నువ్వూ నేనూ ఒకటైనప్పుడు
రవ్వలు రాల్చును తొలి నవ్వు

---



యాదగిరి గుట్ట :

# శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి క్షేత్రం

శ్రీ పి. ఆర్.



యాదగిరి గుట్ట

శ్రీ యాదముని ఋష్యశృంగుని కుమారుడు; శ్రీ లక్ష్మీనరసింహస్వామి భక్తుడు. స్వామిని గూర్చి తపస్సు చెయ్యడానికి దేశ, దేశాలు తిరిగాడు. అలసి, సొలసి ఒక వటవృక్షంక్రింద నిద్రపోయాడు. శ్రీ ఆంజనేయుడు ఆయనకు స్వప్నంలో సాక్షాత్కరించాడు. 'నాయనా! ఇక్కడే ఒక కొండమీద గుహలో శ్రీ లక్ష్మీ నరసింహస్వామివారు ఉన్నారు. కొండమీదే విష్ణుకుండము అనే తీర్థ మున్నది. అందులో స్నానంచేసి, ఆయన గురించి ధ్యానంచెయ్యి, నీకు దర్శనం లభిస్తుంది' అని చెప్పాడు. ఆ ప్రకారమే చిరకాలం యాదమహర్షి నరసింహస్వామిని గూర్చి తపస్సు చేశాడు. స్వామి వ్యాఘ్రరూపంలో ప్రత్యక్షమై, ఏమి వరాలు కావాలో కోరుకోమన్నాడు.

దానికి బదులుగా యాదర్షి ఆ కొండకు యాదగిరి అనే పేరు కావాలన్నాడు. లోకోపకారం కోసం అక్కడే స్థిరంగా వేంచేసి ఉండాలని కోరుకున్నాడు. శ్రీ లక్ష్మీనరసింహస్వామి తథాస్తు అని భక్తునికి రెండు వరాలు ఇచ్చేశాడు. అప్పటినుంచి నల్గొండజిల్లాలో భువనగిరి తాలూకాలో ఉన్న యాదగిరి గుట్ట పవిత్రక్షేత్రంగా శ్రీ లక్ష్మీ నరసింహస్వామి ఆరాధ్య ప్రదేశంగా విలసిల్లుతోంది. యాదమహర్షికి మార్గదర్శకుడైన శ్రీ ఆంజనేయుడే ఈ క్షేత్రపాలకుడు. యాదగిరి మహాత్మ్యాన్ని గురించి వేదవ్యాసుడు రచించిన నృసింహ పురాణం, స్కాంద, బ్రహ్మాది పురాణాల్లో కొన్ని చెప్పి దేవస్థానంవారు ఒక గ్రంథాన్ని ప్రచురించారు.

## స్వామి వెలసిన వృత్తాంతం

శ్రీశైల ప్రాంతంలోని అహోబిల క్షేత్రంలో హిరణ్యకశిపుని సంహారం చేసిన శ్రీ నరసింహస్వామి

ప్రహ్లాదవరదుడై లక్ష్మీ నరసింహస్వామిగా దర్శన మిచ్చి, లోకాన్ని ఉద్ధరించడానికి యాదగిరిలో ఉంటానని చెప్పాడు. యాదగిరి గుహలో శ్రీ లక్ష్మీ నరసింహస్వామి ఆవిర్భవించాడు. ప్రహ్లాదుడు అనేక వర్ష సహస్రాలు అక్కడ తపస్సు చేశాడు. అతదు తపస్సు చేసిన కొండ యాదగిరి ప్రక్కనే ఉంది. ప్రహ్లాదగిరి అని ఇప్పటికీ దాన్ని పిలుస్తూఉంటారు. రాత్రిపూట ఈ క్షేత్రంలో ఋషులు, సిద్ధులు వచ్చి పూజలు చేసి వెడుతూ ఉంటారు. ఏల్లకాలం దేశం నలు మూలలనుండి భక్తులు వచ్చి ఇష్టకామ్యార్థసిద్ధిని పొందుతూ ఉంటారు. ఫాల్గుణ శుద్ధంలో స్వామి కల్యాణోత్సవం జరుగుతుంది. నృసింహజయంతి, శ్రీరామనవమి, కృష్ణాష్టమి మున్నగు పర్వదినాల్లో విశేష ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి.

## మార్గాలు

అట్టి మహాక్షేత్రాన్ని దర్శించాలంటే హైదరాబాదు—ఖాజీపేట రైలుమార్గంలో రాయగిరిస్టేషన్‌లో రైలు దిగాలి. అక్కడనుంచి 3 మైళ్ల దూరం నడచి వెళ్లవచ్చు. లేదా బస్సులలో పోవచ్చు. భువనగిరికి గూడా ఈ క్షేత్రం దగ్గరగానే ఉంది. హైదరాబాదు, నల్గొండ, సిద్దిపేట, మున్నగు అనేక స్థలాలనుంచి బస్సులు ఉన్నాయి. కొండపై జ్వాలా, యోగానంద, గండభేరుండ, లక్ష్మీ నరసింహమూర్తులుగా ఆయన వెలసి ఉన్నారు.

భృగ్వాది మహర్షులు, శ్రీకృష్ణదేవరాయాది సామ్రాట్టులు, ఈ స్వామిని అర్చించి, తరించారు. దాదాపు నలభై ఏళ్లక్రితం బెల్లంకొండ స్వాములవారని దేశ ప్రసిద్ధిగాంచిన సిద్ధులు శ్రీ రామానంద సరస్వతీ స్వాములవారు ఈ క్షేత్రంలో యంత్ర ప్రతిష్ఠ చేశారు. వారిని అక్కడికి ఆహ్వానించినది ప్రస్తుత అనువంశిక ధర్మకర్త శ్రీమతి రాధాభాయమ్మగారు. ఆమె భర్త శ్రీ భాస్కరరాయని సీతారామయ్యశాస్త్రి గారు. ఆ యంత్రంలో ఏ అక్షరాలు ఏ విధంగా ఉండాలో స్వాముల వారికి శ్రీ లక్ష్మీనరసింహస్వామి చెప్పారని ప్రతీతి. యాదగిరి గుట్టలో బ్రాహ్మణులకు, ముఖ్యంగాను, ఇతర వర్ణాలవారికి అందరికిగూడా జాతి, మత భేదం లేకుండా అన్నదానం ఎంతవరకు జరుగుతూ ఉంటుందో అంతవరకూ ఆ క్షేత్రంలోనున్న లక్ష్మీ నరసింహస్వామి పిలిస్తే పలుకుతూ ఉంటాడని స్వాములవారు చెప్పారు. ఆ ఆదేశాన్ని అనుసరించే ఈ క్షేత్రంలో అన్నదానం జరుగుతూ ఉంటుంది. దేవస్థాన ధర్మకర్తల పరిపాలకులు ఈ అన్నదానానికి ఇప్పటికన్న ఎక్కువ ద్రవ్యాన్ని కేటాయించడం అవసరమని భక్తులు భావిస్తున్నారు. కల్యాణోత్సవాలలో జరిగే సంగీత సాహిత్య సభలు విశేషంగా చెప్పుకో దగినవి.

ఈ కొండకు దగ్గరలోనే గుండ్లపల్లి అనే గ్రామమున్నది. స్వామి కొండమీద వెలసి వున్నానని, కొండమీద గుడి కట్టించమని కొంత కాలంక్రితం చెప్పి అంతర్ధానమయ్యాడు. గ్రామస్థులంతా కలిసి ముందు విష్ణు పుష్కరిణిని, తరువాత శ్రీ వీరాంజనేయుణ్ణి, ఆపై గుహలో ఉన్నటువంటి శ్రీ లక్ష్మీ నరసింహస్వామిని దర్శించారు. గుండ్లపల్లి రామ భట్టుగారిని స్వామి కైంకర్యానికి నియమించారు. వారు శ్రీ వైష్ణవులను తప్పించి స్వామి అర్చనకు నియమించారు. ఆయన కుమారుడు వెంకటభట్టు, ఆయన పుత్రుడు స్వామయ్య, ఆయనకు రామయ్య రామయ్యగారికి కుమారులు లేరు. రాధాభాయమ్మ గారొక్కరే కుమార్తె. సీతారామయ్యగారికి ఆమెను ఇచ్చి వివాహం చేశారు. ఈ పురాణ దంపతులిద్దరూ శ్రీ స్వామియెడ అపూర్వ భక్తి శ్రద్ధలను ప్రదర్శిస్తూ తమ జన్మను ధన్యం చేసుకొంటున్నారు.

కొండవిూదికి మెట్లు, రోడ్డుగూడా ఉన్నాయి. 150 దాకా సత్రాలు ఉన్నాయి. తిరుపతి దేవస్థానం వారుగూడా ఒక సత్రం నిర్మించారు. గుడిదాకాగూడా బస్సులు, కార్లు కూడా పోతాయి. కొండవిూదకు ఎక్కడంతోటే అక్కడ వీచేగాలి, భక్తులకెంతో తన్మయత్వాన్ని కల్గిస్తుంది. అక్కడి నీరు అమృతతుల్యం. దీక్షతో ప్రదక్షిణాలుచేసే భక్తులకు స్వామి ప్రత్యక్షమై దేహ సంబంధమైన రోగాలనేగాక, భవరోగాలనుంచి గూడా తరింపజేస్తాడు. కొండవిూద శివాలయం, బ్రహ్మగుండం, వేదపాఠశాల గోశాల వున్నాయి.



గుహలోని స్వయంవ్యక్త శ్రీ లక్ష్మీనరసింహస్వామి మూలవరులు

## కరావలంబ స్తోత్రం

శ్రీ లక్ష్మీనరసింహస్వామి మహాత్మ్యం గురించి శంకరాచార్యాది మహాపురుషులు గానం చేశారు. 'ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక హృన్నివాస—భక్తానురక్త పరిపాలన పారిజాత—లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం' అని శంకరులు రచించిన లక్ష్మీనరసింహస్తోత్రం రాని సంస్కార పరులుండరు. జగద్గురు శ్రీ శృంగేరీ స్వాములవారీ క్షేత్రాన్ని దర్శించి స్వామికి కాన్కలిచ్చారు. శ్రీ లక్ష్మీనరసింహస్వామిని తల్లిగా, తండ్రిగా, గురువుగా, సోదరునిగా, దైవముగా ఆరాధించి తరించిన భక్తాగ్రగణ్యులు ఎందరో ఉన్నారు. వారందరికి మన వందనములు.

శ్రీ రాందయాళ్ సేఠ్, శ్రీ మందుముల నరసింగరావు, రాజా పన్నాలాల్ పిత్తి, శ్రీమతి రాధాభాయమ్మగారలు ధర్మకర్తల సంఘ అధ్యక్షులుగా ఈ క్షేత్రోద్ధరణకు ఎంతో కృషిచేశారు. మొదట్లో రు 3 వేలు ఉన్న ఆదాయం రు. 30 వేల వరకు పెరిగి, ప్రస్తుతం రు. 12 లక్షలదాకా గూడా వృద్ధి యింది.

## మహిమలు

స్వామి మహిమ తెలియాలంటే నిదర్శనాలు కోకొల్లలు. శ్రీమతి రాధాభాయమ్మగారిని అడగవచ్చు. 30 ఏళ్ళ పైగా దేవస్థానం కార్యనిర్వాహకోద్యోగిగా వున్న శ్రీ యాళ్ల బసవయ్యగారిని అడగవచ్చు. స్వామిని ప్రార్థించి మందులు, మాత్రలు, పసరులు, ఇంజక్షన్లు,

శస్త్రచికిత్సలు పొందిన వందలాది భక్తులనుంచి తెలుసుకోవచ్చు. నాస్తికులైనవారుగాని, కేవలం విజ్ఞాన పరిశోధనే లక్ష్యంగా గలవారుగాని ఈ విషయాలు అవహేళన చేయవచ్చుగాక. విశ్వాసం ఉన్నవానికే భగవంతుని మహిమలు గోచరిస్తాయి.

## ముస్లిం భక్తుని కల్యాణ కట్నాలు

స్వామి కల్యాణ మహోత్సవానికి మధుపర్కములు, పానకపు బిందెలు, ఫల, పుష్పములు, పన్నీరు, అగరు, చందనాది కర్పూరములు, పరుండుటకు పందిరి మంచం, కూర్చుండుకు కుర్చీలు, తేనీరు త్రాగుటకు మృణ్మయమైన కప్పులు, భోజనం చేయటానికి పాత్రలు తెచ్చియిచ్చు ప్రథమ భక్తు డెవరో తెలుసా? హైదరాబాదు సమీపంలో బండ్లగూడెంలో ఉండే ఫకీర్. ఆ కుటుంబంవారు స్వామి కల్యాణోత్సవాలకు విధిగా హాజరై ప్రథమ కానుక అర్పించి, స్వామి ఆజ్ఞను పాలిస్తున్నారు. తమ యింటిలోనే ఒక గుహను కల్పించి, శ్రీ లక్ష్మీనరసింహులమూర్తులు పెట్టి, అఖండమైన అర్చనలను జరిపిస్తూ ఉన్నారు. దిక్కులేని ఒక హరిజన స్త్రీ సుఖప్రసూతి అవడానికి స్వామి ఏవిధంగా తోడ్పడిందీ, చెప్పుకుంటూ ఉంటారు. 'దైవంమానుష రూపేణా' అని గూడా మనం వింటాము. శ్రీ లక్ష్మీనృసింహులు రాత్రివేళ వచ్చి, భక్తులకు వరాలు ఇచ్చి, రోగాలు కుదురుస్తూ ఉంటారు. మాటలు రానివారికి మాటలు వచ్చిన సందర్భాలు ఉన్నాయి. కుంటివారు నడిచిన కథలు వింటాం. పుట్టకురుపు రోగులు నిష్పీడితులయ్యారు. గ్రహాది పీడలు పోయాయి. ఈ క్షేత్రం భక్తులపాలిటి కామధేనువు, కల్పతరువు, చింతామణి.

---

# హృదయాకాశం

### శ్రీ వసంతరావు వేంకటరావు

ఆకాశంలో సుకరంగా సంచరించి
బాహ్యాకాశం జయించేవు;
హృదయాకాశంలో ఎందుకైనా
ఎప్పుడైనా పర్యటించేవా?
బాహ్యాకాశంలో విద్యుదయస్కాంత తరంగాలు,
ప్రమాదకర వికిరణాలు, కిరణాలు, కణాలు,
విద్యుదావేశాలు, ఆయస్కాంత బలరేఖలు,
వికృత అయాన్ మండలాలు
విశాలవాన్ ఆలన్ మేఖలాలు
వ్యాపించగా, సంచారం
ప్రమాదభరితమైనా
ఫలవంతంగా పర్యటించే
పథకం కనుక్కొన్నావు
హృదయాకాశంలో చైతన్య స్ఫులింగాలు,
సుఖ దుఃఖ స్పందాలు,
స్వార్థ పరార్థ ప్రకంపనాలు,
కరుణ కాఠిన్య తన్యతలు,
రాగద్వేష పీడనాలు
ప్రేమ వైషమ్య తరంగాలు
భక్తి దౌష్ట్య వికిరణాలు
వ్యాపించగా, దుష్కరమైన సంచారం
అత్యంత సుకరం చేసుకొనే
మార్గాన్వేషణకు పూనుకొన్నావా?
మనస్సంయమనం తెలుసుకొన్నావా?

---

# రాంగ్ లేబుల్

## శ్రీ డి. వి. ఎస్. శర్మ

(ఆంధ్రపత్రిక 'ఆనంద' సంవత్సరాది సంచికలో 'శృంగారము—అశ్లీలము' చదివిన మీదట)

తర్క కర్కశులు శ్రీ తిక్కన్న శాస్త్రిగారు
ఆ భాష్యాంత వైయాకరణులు ('ఆ' తెలుగే. అనుమానం లేదు. అనవసరపు
దెబ్బలాట లనవసరం. అబ్బ, ఎంత గొప్ప సత్యం.)
అలంకార శాస్త్రాలంకారులు, అద్వైతామృత రస ఘనులు
ప్రవచనంలో ధునులు, కించి న్న్యూనంగా మునులు.

అయ్యావారికి కలదు అంతేవాసి బాహుళ్యం
వారి నక్కడ జేర్చింది జిజ్ఞాసా ప్రాబల్యం
వారికి బోధించాడు వాత్సల్య సముద్రులు
శాస్త్రాలన్నీ నిరంతర హసన్ముద్రులు.

ప్రత్యాహారాలూ, ప్రాతిపదికలూ
సమవాయాలూ, అభావాలూ
స్ఫోటాలూ, రసార్భాటాలూ
వివర్తనాలూ, వివరణలూ
అన్నీ, వినిపించారు, అన్నీ చదివించారు

శిష్యులు ప్రజ్ఞానిధులై
భాష్యంబుల తోడ గ్రంథ బాహుళ్యంబున్
చోష్యంబుగాగ జార్చిన
హృష్యన్మను డగుచు గురుడు నుత్సాహించెన్

(పద్యాలతో మనకేం విరోధం లేదు. ఎటొచ్చీ ఒక పట్టాన ఊరిపడవంతే. బైదిబై, ఆధునిక చంపూ (సంస్కృతం మాట) కవిత్వాని కిది అంకురార్పణ.)

వారిలో ఉండేవాడో అర్భనాకారి బాలుడు
పేరే దయితేనేం ? అనుకుందాం జాబాలుడు
అందరితోపాటు పోయేవాడు కాడు
ఆలోచిస్తూ ఉండేవాడు ఎప్పుడూ
నలుగురూ పాఠాలు వల్లె వేస్తుంటే
నక్షత్రాలు లెఖ్ఖపెడుతూ ఉండేవాడు
చెప్పినది అర్థం చేసుకుంటున్నట్లే కనిపించేవాడు
ఇష్టం లేకనో ఏమో తిరిగి చెప్పేవాడు కాడు

అనిపించుకుంటున్నారు మిగిలిన శిష్యులు శాస్త్రాల్లో నిధులని
సంపాదించుకుంటున్నారు చేజిక్కినంతవరకూ నిధులని

అదేమీ పట్టినట్లుండేవాడు
చీమయినా కుట్టినట్లుండేవాడు
ఆచార్యులవారి కీతని ప్రవర్తన వింత
వీడేమౌతాడా అనేది ఆయన వంత
వీడి భవిష్యత్తును గురించే ఆయన చింత

ఉన్నట్లుండి రాశాడో కావ్య ఖండిక
'ఉన్మత్తుల మదనోన్మాదం' దాని శీర్షిక

చదివారు గురువులు, నిర్ఘాంతపోయారు
నిశ్చేష్టులయారు, నిర్వాక్కులయారు
నీరవులయారు, నీరసించారు
నిశ్వసించారు, తల పట్టుకున్నారు
తమాయించుకున్నారు, తేరుకున్నారు
సాయించారు, శాంతంగా

'నాయనా! శృంగారం, రసాలకు శృంగారం
దాన్ని నిర్వహించడం, పెద్దలకే అతిభారం
అనుచిత భాషవల్ల, అవుతుంది రసభంగం
అనర్హ వస్తువైతే, అవశ్యం రసభంగం

శృంగారం రాయడానికి చాలదయ్యా బలపం
సంతరించుకోవాలి విశిష్ట ఛందః శిల్పం
ఏమని ఎన్నుకున్నావయ్యా చూస్తూ
నీ ప్రయత్నానికి ఈ కావ్య వస్తువు.'

విన్నాడు శిష్యుడు, నిర్ఘాంతపోయాడు
నిశ్చేష్టుడయాడు, నిర్వాక్కయినాడు
నీరవుడయాడు, నీరసించాడు
నిశ్వసించాడు, తల పట్టుకున్నాడు
తమాయించుకున్నాడు, తేరుకున్నాడు
విన్నవించాడు, వినయంగా

'అయ్యా! మన సాహిత్యంలో
శృంగారం మినహాయిస్తే
మిగిలిన నవరసాలూ నామమాత్రం
పూర్తి చేద్దామనుకున్నా ఆ లోటు కొంతమాత్రం
ఇక్కడ స్థాయీ భావం జుగుప్స
ఉద్దేశించిన రసం బీభత్సం.'

---

# వేమన చిత్రము

## రచన, చిత్రములు : శ్రీ పులిచెర్ల సాంబశివరావు

మన ప్రాచీనులు చిత్రకళలో సిద్ధహస్తులు. వారరాకికమైన దివ్యమూర్తులను చిత్రించుటకే తమ పవిత్రమైన కళ నుపయోగించిరి. అందువలన మన మహానుభావుల రూపము లెట్లుండెడివో తెలియుట లేదు! శిల్పులు నింతే! శ్రీ కృష్ణదేవరాయుల యాకారము నీనాడు శిల్పములోను, చిత్రములోను గాంచ గలుగుచున్నాము. ఈ వరుసలో వేమన, బ్రహ్మముగారి బొమ్మలనుగూడ చెప్పవచ్చును.

వేమన, వీరబ్రహ్మములకు పెక్కు పోలిక లున్నవి. వీరబ్రహ్మము వేమన శిష్యుఁడు గాఁడు. కాని తన తత్త్వములలోఁ బెక్కు చోటుల వీరబ్రహ్మము వేమనను పేర్కొనెను. వేమన తాను జెప్పఁదలచిన వానిని పద్యములలోఁ జెప్పెను. వీరబ్రహ్మము తత్త్వములలో గానము జేసెను. ఇరువురు చెప్పిన దొకటే! పద్ధతులు వేఱు. వారి చిత్రము లీనాడు లభ్యమగుచున్నవి. వేమన అన్నంతనే తలవంచికొని, చెట్టు క్రింద కూర్చుండునట్టి వ్యక్తి సాక్షాత్కరించును. గడ్డము కొంచెముగాఁ బెరిగియుండును. కన్నులు సగము మూతపడి యుండును. బ్రహ్మము అన్నంతనే మన కెదురుగా పెద్దగడ్డముతో, చిరునవ్వుతో వేఱొక వ్యక్తి కనుపడును.

ఈ చిత్రము లెట్లు ప్రచారములోనికి వచ్చినవో గాని, కొన్ని చోటుల వీరబ్రహ్మముగారివంటి వేమన చిత్రములు గూడ నున్నవి. నాటి వారికి తికమకవచ్చి యిట్టి చిత్రములలో భ్రమపడిరో యేమో చెప్పుట కష్టము. నేడు లభ్యమగుచున్న కొన్ని చిత్రములను పరిశీలించుదము.



చిత్రము - 1.

శ్రీ వేమన యోగీంద్రునిగా ప్రసిద్ధి కెక్కిన వాని చిత్రమిది. తంజావూరి రాచనగరునందున్న చిత్రపట మిది. ఇదే యీనాడు బాగుగ ప్రసిద్ధిఁగన్నది.

చలనచిత్రములకును, అచ్చు పుస్తకములకును నీ బొమ్మనే యాధారముగఁ గొనుచున్నారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ముద్రించిన 'వేమన' అట్ట పైని బొమ్మ దీని ననుసరించినదే!

తల్లి గర్భమందుఁ దాబుట్టినప్పుడు
మొదల బట్టలేదు తుదను లేదు
నడుమ బట్టఁ గట్ట నగుఁబాటు కాదొకో
విశ్వదాభిరామ వినుర వేమ.

అను వేమన పద్యము నీ బొమ్మ సార్థకపఱచుచున్నది. ఈ బొమ్మలో వేమనకు మొలత్రాడున్నది. వేమన కౌపీనధారి. అది తెలియక వేమన పూర్తిగ

దిగంబరుఁడని కొందరు పొరపడిరి. బొమ్మను జాగ్రత్తగ గమనించిన సత్యము స్పష్టమగును.



చిత్రము - 2.

ఈ చిత్రమునకును పైని వివరించిన చిత్రమునకును భేదము లేదు. మొలత్రాడీ చిత్రమున లేక పోవుట గమనార్హము. ఇది చిత్రకారుని కళా కౌశలమే గాని యదార్థము గాదని నా యభిప్రాయము. రేఖలలో చిత్రకారుని అసమర్థత సుస్పష్టమగుచునే యున్నది. ఇది 1 వ చిత్రమునకు ప్రతికృతియేగాని వేఱు గాదు. చెట్టుక్రింద, పులి చర్మముపై, పండ్లు ముందుంచికొని తినుటకు సిద్ధమగుచున్నాడు మన వేమన! కుడికాలు వశము తప్పినది పాపము!

ఈ బొమ్మ లభించుట కొక కథ యున్నది. ఒక సిపాయి యింట నీ రంగులబొమ్మ యుండెనఁట! పమ్మి త్యాగరాయశెట్టి కంపెనీవారా బొమ్మకు నకలు దీయించి 1807 లో వేమన పద్యములను పుస్తకములో నచ్చు వేయించిరి.

కోళప్పన్ జేరి లక్ష్మణమొదలియారుగా రచ్చు వేయించి వేమన పద్యములు గ్రంథమందును నీ బొమ్మ కలదు. ఇట్టి బొమ్మలన్నియు తంజావూరి రాచనగరు నందున్న వేమన చిత్రమును పోలినట్టివే! చిత్రకారుఁడు ప్రవీణుఁడు గాకుండుటచే గొంచెము వంకరటింకరగాఁ జిత్రించెను.

ఇంతవఱకు వేమన యొక ప్రక్కకుఁ దిరిగి కూరుచుండగాఁ జూచితిమి. ఇఁక బ్రహ్మముగారివంటి వేమన! ఈ 3 వ చిత్ర మిట్టిది. రాయవరపు పూర్ణయాచారిగారు ప్రకటించిన గ్రంథములో నిట్టి చిత్ర మున్నది.

మొగము వీరబ్రహ్మముగారి మొగమువలె నున్నను, కూరుచున్న పద్ధతినిబట్టి యిది వేమన బొమ్మయే యని నిర్ణయింపవచ్చును. 1–2 చిత్రములలో నున్న వేమనను మనవైపునకుఁ ద్రిప్పినచో నిట్లే యుండునేమో!



చిత్రము - 3.

కాని, చిన్న సందియము. ఈ వేమనకు వెండ్రుకలు భుజములను దాఁకుచున్నవి. 1–2 చిత్రములలో జుత్తు సంస్కరింపఁబడినట్లున్నది! మొత్తమువిూద మూఁడవ చిత్రములోని బొమ్మ వేమనయే యని నమ్ముచున్నాను.

ఈ చిత్ర మెవరిదో చెప్పుట కష్టము. ఇది పెరంబూరులోనున్న పెన్నను సుబేదారుకడ నుండగా వావిళ్లవారు తీసికొని తమ గ్రంథములో నచ్చొత్తించిరి.

ఈ కూరుచున్న తీరు ప్రసిద్ధమైన వేమన వంటిది కాదు. అందువలన ననుమానింపవలసి వచ్చు



చిత్రము-4.

మున్నది. వీరబ్రహ్మము గూడ నిట్లేయుండును. కొన్ని భేదములనుబట్టి యిది వేమన బొమ్మయే యని యూహించుచున్నాను. వీరబ్రహ్మము మొలపై వస్త్ర ముండును. యజ్ఞోపవీతమును ధరించియుండును. బొట్టు పెట్టికొనియుండును. వేమన కివి యుండవు. కావున నాల్గవ చిత్రము వేమనదేయని భావింపవచ్చును.

ఈ నాలుగు బొమ్మలు వేమనవేయైనను మొదటి బొమ్మయే ప్రసిద్ధివహించినది. వేమన యన్నంతనే యా బొమ్మయే మనకు స్ఫురించుచున్నది. మన



శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు.

మనసులలో మొదట వేమన యాకారమున కది రూప కల్పన యగుటయే యిందుకు కారణము.

---

# వేకువ

శ్రీ రామా చంద్రమౌళి

క్రీచురాళ్ల రొదలో కూర్చుని ఆలోచిస్తున్నాను—
కన్నీళ్లనుండి విద్యుదుత్పాదనకు ప్రయత్నాలు జరుగుతున్నాయి
ఆక్రందిస్తున్న ఆకలి ప్రేగుల చివరలకు బల్బులు వ్రేలాడుతున్నాయి చీకట్లో
ఇక వెలుతురు పుట్టాలి.
నల్లగా మట్టి మనుషులు
కాంతికోసం చీకటిని త్రవ్వుతున్నారు నిర్విరామంగా
.... అప్పుడప్పుడు ఆకాశం చిట్లుతోంది
ఆ పగిలిన ప్రభాశకలాల్లో
బిస్కెట్లు నములుతున్న మంత్రిగారి కుక్కవంక
ఆశగా, ఆకలిగా చూస్తున్న నిరుద్యోగి ముఖం రక్తచందనంలా మెరుస్తోంది.
నిశ్శబ్దంగా ముంచుకొస్తున్న నీరవ శలాకల్లోనుండి
సన్నగా... అస్పష్టంగా... మధురంగా
లాడ్జింగుల్లో కిరాయి ఆడవాళ్ల కృత్రిమ విరహ నిక్వణాలు నవ్వుతున్నాయి
ఈ అర్ధరాత్రి—
ఎవడో చిత్రకారుడు ... అదిగో
పర్వత ముఖంపై ఆకాశమంత శవ చిత్రంగీసి 'దేశం'—అని రాస్తున్నాడు
నేను మార్ఫియా తీసుకున్న మనిషిలా
వేకువను సుందరంగా ఊహించుకుంటూ కళ్ళు మూసుకుంటున్నాను
ఎదురుగా గోడమీద
జింకమీదకు లంఘిస్తున్న సింహం పటం మసకగా కనబడుతోంది.

---

# విజయనగర చరిత్ర

## [ రెండవ భాగము ]

డా. నేలటూరు వేంకటరమణయ్య

### అచ్యుతరాయలు (1530—1542)

**(గత సంచిక తరువాయి)**

కృష్ణదేవరాయలు మృతినందినప్పుడు అచ్యుతదేవరాయలు చంద్రగిరియం దుండెను. అన్నగారి మరణవార్త విన్నంతటనే యతడు రాజధానియైన విద్యానగరమునకు బోవక తిరుమలయందు వేంకటేశ్వరుని సన్నిధానమునం దొక పర్యాయమును గాళహస్తియందీశ్వరుని సన్నిధానమున మరియొక పర్యాయమును రెండుమారులు పట్టాభిషేకము జేసికొనినట్లు సమకాలిక శాసనములవలన దెలియవచ్చుచున్నది. రాజధానియందుగాక యన్యప్రదేశములందు పట్టాభిషేకము జేసికొనిన రాయలితడొక్కడే. దీనికి కారణము లేకపోలేదు. మరణకాలమప్పుడు కృష్ణరాయలష్టాదశమాస వయస్కుడైన దనపుత్రుని గాని, సింహాసనమునెక్క నర్హతగల యన్యవారసులను గాని లెక్కగొనక తన సవతి తమ్ముడైన యచ్యుతరాయలు దనయనంతరము సామ్రాజ్యమునకు పట్టబద్ధుడు గావలయునని శాసించియుండెను గదా. ఈ నియామక మందఱకుమ నచ్చినది కాదు. అందఱికంటె గృష్ణరాయల యల్లుడైన అళియరామరాజున కది కరమప్రియమాయెను. ఇతని ప్రస్తావము గృష్ణరాయలనాటి శాసనములం దెచ్చటను గానరాకపోయినను అప్పటి రాజకీయరంగమున నితడు గొంత ప్రాధాన్యమును గడించి వాసికెక్కినట్లు అర్వాచీనాంధ్ర వాఙ్మయమువల్లను మహమ్మదీయ చరిత్రలవల్లను పాశ్చాత్య పోర్చుగీసుల రచనలవల్లను దెలియుచున్నవి. అళియ రామరాజు చాళుక్యవంశజుడైన క్షత్రియుడు. శ్రీ రంగరాజు పుత్రుడు. ఆరవీటి బుక్కరాజు రామరాజు మనుమడు. ఇతనికి ఎఱతిరుమల లేక తిమ్మరాజు వెంకటాద్రి యను సోదరు లిరువురు గలరు. వీర లిరువురును ఇతనికి కుడియెడమ భుజములవలె వర్తించుచు నితడు విజయనగర సామ్రాజ్యమునకు సర్వాధికారియైన పిమ్మట నతని కార్యమునకు ఖడ్గమునకును గర్తలై ప్రఖ్యాతిసందిరి. వీరి జన్మస్థానము కందనవోలు. కాని రామరాజు మొట్టమొదట బయలు వెలసినది గోల్కొండ కుతుబ్‌శాహీ యాస్థానమునందు. ఇతని పూర్వచరిత్ర తారీఖ్ మహమ్మదు కుల్లీ కుతుబ్‌శాహీ యనుగ్రహముగ వర్ణింపబడి యున్నది.

కుతుబ్‌శాహీ రాజ్యస్థాపకుడైన సుల్తాన్‌కుల్లీ రామరాజును దన కొలువులో జేర్చుకొని విజయనగర గడి ప్రదేశమునం దొక దుర్గమున కధిపతినిజేసి యచట కంపెను. అచట నితడు దుర్గాధిపత్యము సేయుచుండగా గృష్ణదేవరాయలు దండెత్తివచ్చి యాదుర్గమును ముట్టడించెను. ముట్టడికి నిలవజాలక రామరాజు కృష్ణరాయలకు ఆ దుర్గమును వశపఱచి గోల్కొండకు బోయి సుల్తాన్‌కుల్లీ కావిషయమును నివేదించెను. ఆతడా వార్తను విని నంగనే మండిపడి యట్టి రణభీరువు తన రాజ్యమునందుండ తగడని తెగనాడి వెడలగొట్టెను. అంతట రామరాజు చేయునది లేక గోల్కొండనుండి విజయనగరమునకుబోయి రాయ సంస్థానమును జేరుకొనెను. కృష్ణదేవరాయలతడు శక్తిసామర్థ్యములు గలవాడని గ్రహించి చేరదీసి తన కుమార్తెనిచ్చి యుద్వాహముజేసి రాజ్య పరిపాలనయందు ప్రవేశపెట్టెను. ఫాదిరి కైరాసను పోర్చుగీసు చరిత్రకారుడు తన సింహళద్వీప చరిత్రలో నితడు కృష్ణదేవరాయలకు మంత్రియై యుండెనని వ్రాసియున్నాడు. కృష్ణరాయ

లితనికి తన కూతునిచ్చి యుద్వాహము జేసినది వాస్తవమని సమకాలికాంధ్ర వాఙ్మయము రుజువుసేయుచున్నది. రాయల యల్లునికి రాజకార్యములందు పలుకుబడి లేకపోవునా? కావుననే యచ్యుతరాయలు అతడు తాను సింహాసనము నధిష్టించుట కియ్యకొనడని యాశంకించి రాజధానికి బయలువెడలుటకు ముందె తిరుమలలోను కాళహస్తియందును పట్టాభిషేకము జేసికొనెను.

అచ్యుతరాయల యాశంకకు కారణము లేకపోలేదు. అళియ (అల్లుడు) రామరాజున కచ్యుతరాయలు సింహాసనము నధిష్ఠించిన రాజ్యమున దనకు పూర్వము నుండిన పలుకుబడి యటువిూద లేకపోవునని భయము గల్గినది. కావున నతడచ్యుతరాయలను సింహాసనము నెక్కనీయక భంగపఱచుటకు ప్రయత్నములు గావించెను. కృష్ణరాయల పుత్రుని, పదునెనిమిది మాసముల నిసుగును, చక్రవర్తియని ప్రకటించి యాబాలునిపేర దాను రాజ్యముసేయ సమకట్టెను. కాని యతని యత్నము సాళువనాయకుని ప్రతిఘటనవలన కొనసాగదయ్యె.

అతడు కృష్ణరాయలయాదేశము చొప్పునయచ్యుతరాయల పక్షము వహించి సింహాసనమును గాపాడుచు రామరాజు పన్నాగమును నెగ్గనీయక భగ్నము గావించెను. అంత నచ్యుత రాయలు చంద్రగిరినుండి బయలువెడలి విజయనగరమునకు వచ్చిచేరెను. కాని యతనిని రామరాజువలన భయము విడువలేదు. ఏలనగా గృష్ణరాయల కుమారుడు పదునెనిమిది మాసముల పాపడైనను నతనికి రాజ్యాధిపత్యము వహించుటకు దనకంటె నధికతరమ్మైన హక్కు గలదు. అతడు రామరాజుయొక్క సంరక్షణ యందుండుటవలన సమయ మనుకూలమైనప్పుడు రామరాజు తన్ను పదచ్యుతుని జేయగలడను శంక యతని బీడింప గడగినది. కావున రామరాజుతో నెట్లైన సమాధానపడుట తనకు శ్రేయస్కరమునియెంచి యతనితో సంధి జేసికొనెను. ఈ సంధి షరత్తుల ప్రకారము అచ్యుతరాయలు గృష్ణరాయల కుమారుని రాజ్యపాలనయందు తనతో సమానాధికారముగల భూస్వామిగజేసి యతని పక్షమున రామరాజు రాజకార్యములందు పనిగొన నంగీకరించెను. ఇట్లు తన స్థానమును స్థిరపఱచుకొనిన పిమ్మట నచ్యుతరాయలు మరల నొక పర్యాయము రాజధాని విజయనగర పట్టణమందు పట్టాభిషేకము జేసికొనెను.

రామరాజుతో నిట్లు సమాధానమును గుదురుచుకొన్నను అచ్యుతదేవరాయల పాలన శాంతియుతముగ సాగలేదు. రాజ్యారంభకాలమునుండియు నతడు శత్రువులతో బోరాడవలసి వచ్చెను. వారిలో రాజ్యముపై నెత్తివచ్చిన పరమండలాధిపతులు గొందఱు అసంతృప్తులైన రాయసామంతులు గొందఱు. కృష్ణరాయల మరణవార్త విన్నంతటనే పూర్వమతనిచే పరాభూతులై రాష్ట్రములను గోల్పోయిన పరరాజులందఱును దుర్జయుడైన శత్రువు గతించినందులకు సంతసించి తమకడనుండి పూర్వమాతడు నాచికొనిన భూములను మరల గైవసము జేసికొనుటకొఱకు రాయసామ్రాజ్యముపై నొక్కుమ్మడి దండెత్తి వచ్చిరి. గజపతి ప్రతాపరుద్రుడు కృష్ణానదికి దక్షిణమునందుండు తీరాంధ్రము నాక్రమించుకొనుట కొఱకును, కుత్బ్ షాహు సుల్తాను కల్లికొండవీటిని కబళించుట కొఱకును, ఇస్మాయీలాదిలషాహు కృష్ణాతుంగభద్రల నడిమి యంతర్వేది నాక్రమించు కొనుటకును సైన్యసమేతులై వెడలివచ్చిరి.

గజపతి దండయాత్రను గూర్చి యొక యైతిహ్యము గలదు. కృష్ణరాయలు దివంగతుడైనందులకు వందురుచుండిన యాంధ్రకవితాపితామహుడల్లసాని పెద్దనామాత్యుడు గజపతి యెత్తి వచ్చినాడని విని 'రాయరావుతుగండ' యను సీసపద్యమును రచించి యతని కంపెననియు, దానిని చదువుకొని లజ్జితుడై యతడు నిజరాజ్యమునకు పోయెననియు జెప్పుదురు. గజపతి యెత్తివచ్చినది వాస్తవము; కాని యతడు పెద్దన వ్రాసి యంపిన పద్యమును జదువుకొని లజ్జితుడై మరలిపోయెననుట యతిశయోక్తి. దండెత్తివచ్చిన శత్రువు పెద్దనగారి యెత్తిపొడుపు మాటలవలన లజ్జితుడై వెనుదిరిగిపోయెననుట నమ్మరాని సంగతి. అప్పటి శాసనాది సాక్ష్యమును బరికించి చూడగా గజపతియొక్క నిష్క్రమణమునకు గారణము యుద్ధమునం దతడు పొందిన పరాజయమని తెలియుచున్నది. క్రీ. శ. 1529 30 నాటి యచ్యుతరాయల శాసనములందొక దానియందతడు 'ఒడ్డియ దళ విభాళుడనియు' 'దురుష్కమనోభయంకరుడ'నియు జెప్పియున్నది. మఱియొకదానియందు ఆత డుత్కళేశ్వరు నోడించి యతనిపై గరుణ చూపెనని యున్నది. రాధామాధవకవి తన

తారక బ్రహ్మరాజముయొక్క పీఠికయందు గజపతి యోట మిని ప్రస్తావించి య న్నాడు. కావున దండెత్తివచ్చిన గజ పతిని అచ్యుతరాయలు దార్కొని రణమున బరాభూతుని గావించి పాఱదోలెనని నిశ్చయముగ జెప్పవచ్చును.

గజపతి వలెనే గోల్కొండ సుల్తాన్ కుల్లీ కుతుబ్షాహుకూడ విజయనగర సామ్రాజ్యము పై నెత్తి వచ్చెగదా. అతని దండయాత్ర విశేషముల నజ్ఞాత నామధేయుడైన గోల్కొండ చరిత్రకారుడిట్లు వివ రించి యున్నాడు. కొండవీటిరాజు కప్పమును జెల్లించక యుపేక్షజేసి యుండగా సుల్తానుకుల్లీ నల్లగొండనుండి యా దుర్గముపై నడిచి ముట్టడి వేసెను. తీవ్రముగ ముట్టడి సాగినను ఆ రాజప్రమత్తుడై పటుబాహు పరాక్రమముతో కోటను సంరక్షించుచుండుటవలన చిరకాలము ఆ కోట పట్టుబడదాయెను. అతడంతట సుల్తానుగారి మహమ్మదీయ సర్దారులకు లంచ మిచ్చి వారి మూలము సంధి జేసికొనదలపెట్టెను; సంధి జేసికొనుట కిష్టపడినను, సుల్తాను కోట పట్టు వడెను. అంతట సుల్తానుకుల్లీ తన విజయ సూచక ముగ కోట నట్టనడుమ నొక గోపురము గట్టించి రాజధానికి మరలిపోయెను.

పై విజయ వృత్తాంతము సత్యాత్మకము గాదని తోచెడిని. క్రీ. శ. 1514 లో గృష్ణరాయలు గజపతిని జయించి కొండవీటి దుర్గము గైకొనినది మొదలు అచ్యుతరాయలు సింహాసనము నధిష్ఠించుట వఱకును నటుపిమ్మట గూడ నిరాఘాటముగ నచట రాయల యధికారము జెల్లుచుండి నట్లిచట గన్పట్టు శాసనములు దెల్పుచున్నవి. కొండవీటిని జయించి స్వాధీనపఱచుకొనిన పిమ్మట గృష్ణదేవరాయలా దుర్గ మును దాని క్రింది రాష్ట్రమును మహామంత్రి తిమ్మరుసయ్యగారికి నాయంకరమునకు పాలించి యుండెను. అతని పక్షమునందతని మేనల్లుండ్రు నాదిండ్లయప్పరగోపనలు 1526 వఱకును నా రాజ్య మునకు పాలకులై యుండిరి. అటుతరువాత కృష్ణ దేవరాయలు రాయసం కొండమరుసయ్య కుమారుని లయ్యపరుసయ్యను కొండవీటికి దుర్గాధ్యక్షుని సియ మించెను. ఇతడీ పదవియందు క్రీ. శ. 1529-30 వఱకు వహించుకొని యుండెను. అచ్యుతరాయలు రాజ్య భారము వహించినప్పుడు కొండవీటికి దుర్గాధ్యక్షుడై యుండిన వాడితడే. ఇతని తరువాత నచ్యుతరాయలు సలకరాజు పెదతిరుమలరాజును రామయభాస్కరుని యొకని వెనుక నింకొకని కొండవీటికి దుర్గాధ్యక్షు లనుగ నియమించెను. పై బేర్కొనిన దుర్గాధ్యక్షులలో నెవ్వరును గోల్కొండ కుతుబ్శాహున కరిగాపులై కప్ప మిచ్చియుండలేదు. అప్పుడు కృష్ణానదికి దక్షిణమం దెచ్చటను గుతుబ్శాహుల యధికారము జెల్లుచుండినట్లు సూచించు సాక్ష్యమెద్దియు గానరాదు. కాని కొండవీటి సుల్తాన్కుల్లీ దండెత్తివచ్చినది సత్యముగాదు. అప్పటి శాసనములలోను వాఙ్మయమునందును సదరు దండ యాత్ర ప్రస్తావము గలదు. అచ్యుతరాయలు చంద్ర గిరినుండి విజయనగరమునకు బోవుటకు ముందే మహమ్మదీయులను జయించినట్లు శాసనములు దెల్పు చున్నవి. ఈ సందర్భమున వెలుగోటిగని తిమ్మా నాయుడను బాచరససబరు రామయ భాస్కరుడును రాయలతోగూడ దండునడచి తురకల నెదిర్చి పాఱ దోలిరి. గని తిమ్మానాయుడు గడిదాటి రానీయక అడ్డ గించి మలకకాల్బలమును నేలకాల్బలముజేసెనని వెలు గోటి వారి వంశావళి యితనిని ప్రశంసించుచున్నది, రామయ భాస్కరుడు మహమ్మదీయ సైన్యములను దన బాహుపరాక్రమముచే జయించి రాష్ట్రమును సంరక్షించెనని యితని సోదరి తానెత్తించిన వంకా యలపాటి శాసనము జెప్పియున్నది. కావున కృష్ణ రాయలు గతించిన తరువాత సుల్తానుకుల్లీ కుతుబ్శాహు కొండవీటిమీద దండెత్తి వచ్చినది వాస్తవము; కాని యతని కజ్ఞాత గోల్కొండ చరిత్రకారుడు చెప్పినట్లు జయము చేకూరలేదు; గడిప్రాంతమందే యతని నచ్యుతరాయ లెదిర్చి యుద్ధమునందోడించి పాఱదోలెనని నిశ్చయముగ జెప్పవచ్చును.

కృష్ణరాయల మరణమును తమపరి విజయ నగరమున రాజ్యాధిపత్యము కొఱకు కుప్పనించిన యంతః కలహములను సందు చూచుకొనిన రాయచూరు రాజ్య మును మరల స్వాధీనపఱచుకొనుటకై కృష్ణా తుంగ భద్రలయందంతర్వేదిపై దండువెడలెను. వరాదు దేశాధిపతియగు ఇమాదుశాహును బెడదకోట పాలకు డైన బరీదుశాహును దమతమ దళములతో గూడ నత నికి తోడు నడచిరి. వీరు రాయచూరు ముద్గలు దుర్గ ములను మూడునెలల కాలము ముట్టడించి కైవసము గావించికొనిరని మహమ్మదీయ చరిత్రకారుడు ఫెరిష్తా వ్రాసియున్నాడు. వీరి దండయాత్ర యడ్డమాకలేక

సాగలేదు. రాయచూరంతర్వేదియం దుడిగి దనియక యచట గపుండిన రాయచూరున యడ్డగించెను. కూరక చెర్లయనుచోట గొప్ప సంగ్రామము సంఘటిల్లినది. అని మొనసిచి దుర్భటశ్రములను ముందుకు సాగనీయక యారవీటి రామరాజు తిమ్మరాజు పుత్రుడు, అప్పలరాజు ఘోరముగబోరుచు వీరస్వర్గమును జూఱగొనెను. అంతట రాయదళము వెన్ను విఱిగి పలాయనపరమైనది. తరువాత మహమ్మదీయులు కృష్ణా తుంగభద్రలను మధ్య ప్రదేశమును సమస్తమును నిరాటంకముగ నాక్రమించుకొనిరి.

అచ్యుతరాయలు వెంటనే దండుచేసిపోయి విజాపుర సుల్తానును బాఱదోలి రాయచూరు రాజ్యమును మరల స్వాధీనపఱచుకొనుటకు వలనుపడకపోయెను. దీనికి గారణము సాళువ నాయకుని యాధిపత్యమున ద్రావిడదేశమున జెలరేగిన తిరుగుబాటు. సాళువ నాయకుడొక చోళ మండలమునకు మాత్ర మధిపతి యైనను ద్రావిడ దేశమును బాలించుచుండిన పెక్కండ్రు నాయకులును దొరలును నితని ప్రాభవమునకు లోనై యతనికి తోడ్పడిరి. వారిలో బరమకుడి ప్రభువైన తుంబిచ్చి నాయకుడును తిరువడి దేశాధిపతియు ప్రముఖులు. తుంబిచ్చినాయని గూర్చి తెలియ వచ్చు విశేష చరిత్రాంశము లేవు. తిరువడి దేశాధిపతి ప్రబలుడు. ఇతనినే రాజనాథ డిండిమకవి చేర దేశాధిపుడని పేర్కొనియున్నాడు. ఇతని రాజధాని యిప్పటి కేరళ రాష్ట్రములోని కొల్లము (Qui on) తిరువడికి విజయనగరరాయలతో పారంపర్యముగ వైరము గలదు. సాళువ నరసింహరాయలు నరసానాయకుడును తిరువడి దేశమును జయింపగోరి దండయాత్రలు నడిపియుండిరి. కాని తిరువడిని జయింపజాలరైరి; కాని కృష్ణరాయల కాలమున తిరువడిరాజు రాయలకరిగాపైనట్లున్నది. కృష్ణరాయల నిర్యాణానంతరము స్వేచ్ఛాప్రియుడైన యారాజు విజయనగర రాజ్యమందలి కలతలను సందు చేసికొని సాళువనాయకునితో సఖ్యము గుదుర్చుకొని నిజస్వాతంత్ర్యమును బునఃప్రతిష్ఠించుట కుద్యమించెను. దక్షిణదేశమందలి యలజళ్ళను జూచి కర్ణాటకమం దుమ్మచ్చూరు నుగ్గిహళ్ళి ప్రభువులు రాయల యధికారమును ధిక్కరించి స్వతంత్ర పతాకల నెత్తిరి. కావున నచ్యుతరాయలు ద్రావిడ కర్ణాటక దేశములందు రేగిన యల్లరుల నణగగొట్టి నిజాధిపత్యము నచట బునఃప్రతిష్ఠాపించుట తనకు ప్రథమ కర్తవ్యమని నిశ్చయించి తాత్కాలికముగ నాదిల్షాహునిపై దండుసేయుట నుజ్జగించి దక్షిణ దిగ్విజయార్థము బయలువెడలెను.

సాళవనాయకు డచ్యుతరాయలకు హితుడు — అచ్యుతరాయలు చంద్రగిరినుండి విజయనగరమునకు వచ్చి చేరునందాక సింహాసనము నన్యాక్రాంతము గానీయక సంరక్షించి యతని కప్పజెప్పెను గదా. మఱి యచ్యుతరాయలు పట్టాభిషిక్తుడైన వెంటనే యతడేల తిరుగుబాటు చేసెనో తెలియదు. శాసనములుగాని యన్యచరిత్రాధారములుగాని యతని తిరుగుబాటునకు కారణమును వివరింపబడవు. కాని యాధునిక శాసన పరిశోధకులు కొందఱతని మత పక్షపాత మొక కారణమందురు. అచ్యుతరాయలు తన పట్టాభిషేక సమయమున కాంచీపురమందలి వరదరాజు యేకామ్రనాథాలయములకు ఉమ్మడిని కొన్ని గ్రామములను దానము జేసియుండెను—ఆ గ్రామముల నా రెండు దేవాలయములకు నెక్కువ తక్కువలు లేకుండ సముగ బంచిపెట్టుమని రాయలు సాళువ నాయకుని నియోగింపగా నతడు వరదరాజాలయమునకంటె నేకామ్రనాథుని కధికభాగము నిచ్చెను. ఆ విషయ మచ్యుతరాయలకు తెలియ వచ్చినంతటనే యాతడా గ్రామములను సమముగ బంచియిచ్చెను. అందులకు సాళవ నాయకుడు కుపితుడై రాయలను ధిక్కరించి తిరుగుబాటు చేసియుండునని శాసన పరిశోధకుల యూహ. కాని యీ కారణము సరియైనదని తోచదు. తాను చేసిన గ్రామ విభాగము సరికాదని రద్దుచేసి పునర్విభాగమును జేసినంతమాత్రముననె సాళువనాయకుడు రాయలపై క్రోధము వహించి రాజద్రోహమును దలపెట్టియుండునా? అతని తిరుగుబాటున కంతకంటె బలవత్తరమైన కారణ ముండియుండవలయును. రామరాజుయొక్క యధికార వ్యాప్తి సాళువనాయకుని తిరుగుబాటునకు వాస్తవమైన కారణమని తోచుచున్నది. రాజ్యాధికారము హస్తగతము కాగనే రామరాజు తన ప్రతిపక్షులను పదచ్యుతులను గావించి వారి స్థానములందు తన బంధువులను, మిత్రులను, ననుచరులను నియోగించెననియు నతనిపై రాయసామంతు లనేకులు దిరుగుబాటు చేసిరనియు దత్కారణమున రాయచూరు ముద్గలు దుర్గములపై విజాపుర మహమ్మదీయుల

దండయాత్ర నిరాఘాటముగ గొనసాగెననియు ఫెరిష్తా వ్రాసియున్నాడు. ఫెరిష్తా చెప్పినట్లు రామరాజుపై దిరుగుబాటు చేసిన రాయసామంతులు సాళువ నాయకుడును నాతని సంగడికాండ్రును గావలయును.

సాళువ నాయకుని నాతని మిత్రులను నణగ గొట్టి దన యధికారము నచట పునఃప్రతిష్ఠించుట కొఱకచ్యుతరాయలు దక్షిణ దిగ్విజయమునకు బయలు వెడలెను. సైన్యము రాయల బావమఱది సలకరాజు తిరుమలరాజు నాయకత్వముక్రింద యుద్ధమునకు నడచెను. యుద్ధకార్య మంతయు దిమ్మరాజు నిర్వహించుచుండగా యచ్యుతరాయలు చంద్రగిరిజేరి తత్సమీపముననుండు తిరుపతి, కాళహస్తి, కంచిమున్నగు పుణ్యక్షేత్రములను సేవించి తిరువణ్ణామలమీదుగ ప్రయాణముజేసి శ్రీరంగమును జేరెను. అచ్చట కొంతకాలము విడిసి యుండెను. ఈ లోపల తిరుమలరాజు చోళమండలము నందెచ్చటనో సాళువనాయకుని దారసిల్లి యుద్ధమునందోడించి దిశాపట్టుని గావించెను. యుద్ధ విశేషము లెవ్వియు దెలియరావు. కాని రాజనాథ డిండిమకవి తన యచ్యుతరాయాభ్యుదయమునందీ యుద్ధ విషయము నీషన్మాత్రము ప్రస్తాపించియున్నాడు. రాయల మీద చెల్లప్ప (సాళువ నాయకుడు) తిరుగుబాటు చేసెననియు యుద్ధమున రాయరాణువచే పరాభూతుడై చేరరాజ్యమునకు బాఱి యచ్చట చేరరాజు నాశ్రయమున తలదాచుకొనెననియు నతడు వ్రాసియున్నాడు. ఇందువలన సాళువ నాయకుడు యుద్ధమునందోడి దేశత్యాగముజేసి చేరదేశమునకు పరారియైపోయి యచట దాగెనని తెల్లమగుచున్నది. సాళువ నాయకుడు పాఱిపోగా సంరక్షించువారు లేకపోవుటవలన చోళమండలము రాయలకు సులభముగ స్వాధీనమై యుండుననుటకు సందియము లేదు.

సాళువ నాయకుని పరాజయ పలాయనములతో నతని తిరుగుబాటంతమందలేదు. పరదేశమునందన్యాశ్రయమున బ్రవాసమున్నను నతడు తన కపటప్రయోగములను మానలేదు. తిరువడిని (చేరరాజును) తుంబిచ్చి నాయకుని బ్రోత్సహించి తత్సమీపమందలి తెంకాశి పాండ్య రాజ్యముపై దండు వెట్టించెను. వారి ధాటి కాగజాలక పాండ్యరాజు నిజరాజ్యమును విసర్జించి పాఱిపోయెను. అంతట వారాతని రాజ్యము నాక్రమించుకొనిరి. ఈ విషయము శ్రీరంగమున రంగనాథుని సేవయందును, విద్యాది వినోదములందును నిమగ్నుడై యుండిన యచ్యుతరాయల కెఱుక పడెను. అంతట నాతడు సాళువనాయకుని మిత్రసహితముబట్టి తెమ్మని సేనాధిపతి సలకరాజు తిరుమలరాజు నాజ్ఞాపించెను. తిరుమలరాజు సైన్యముతో గదలి కతిపయ ప్రయాణములమీద మధురమజేరి, యచటనుండి బయలువెడలిపోయి తామ్రపర్ణీ తీరమున విడిసి యొక దండనాయకుని కొంత దళముతో దిరువడి రాజ్యము మీద కంపెను. రాయసైన్యము దన రాజ్యము మీదికి వచ్చుచున్నదని విని తిరువడి దళములను గూర్చుకొని తన రాజ్యపుటుత్తర సరిహద్దున నుండు కనుమలలో విజయనగర సేనల మార్గము నరికట్టెను. ఉభయపక్షములకు ఘోర సంగ్రామము సంఘటిల్లెను. ఎంత పరాక్రమముతో బోరినను తిరువడి విజయనగర సేనల ధాటికి నిలువజాలక పరాభూతుడాయెను. ఇంతటనె సలకరాజు తిరుమలరాజును తామ్ర పర్ణీతీరమునుండివచ్చి రణక్షేత్రమును జేరెను. పరాజయానంతరము చేయునది లేక సాళువనాయక తుంబిచ్చి నాయకులతోగూడి తిరువడి రాయస్కంధావారమునకు బోయి తిరుమలరాజునకు గజాశ్వద్యుపాయనముల నర్పించి శరణము వేడెను. తిరుమలరాజు వారిని దోడ్కొని వెనుదిరిగి శ్రీరంగమునకు బోయి యచ్చట నచ్యుతరాయలకు విజయవృత్తాంతమును నివేదించి శరణార్థులై తనతో వచ్చిన శత్రుల కభయ ప్రదానము నర్థించెను. తిరుమలరాజు విజ్ఞాపనమును మన్నించి వారి కభయ మొసగి యంతకుముందే కాందిశీకుడై వచ్చి తన శిబిరమున తల దాచుకొనియుండిన పాండ్యరాజు నాతని రాజ్యమునందు పునఃప్రతిష్ఠితుని గావించెను. పాండ్యుడు నిజ కృతజ్ఞతా చిహ్నముగ దన పుత్రికను రాయల కిచ్చి యుద్వాహము గావించెను. దక్షిణ దిగ్విజయ మిట్లు విజయవంతముగ సమాప్తి జేసికొని యచ్యుతరాయలు శ్రీరంగమునుండి తన శిబిరమును లేవనెత్తుకొని పశ్చిమాభిముఖుడై కావేరీ తీరముననే కూచిచేసి యుమ్మత్తూరిపై నడచెను.

ఉమ్మత్తూరు ప్రభువుయొక్క తిరుగుబాటునకు కారణము వేఱు. సాళువనాయకునివలె నితడు రామరాజు మీది పగవలన రాయల యధికారమును ధిక్కరించి స్వతంత్రుడగుటకు తలపెట్టలేదు. ఉమ్మ

త్తూరు దొరలు తాము ప్రాచీన హొయ్యసల వంశజులనియు గర్ణాటక రాచరికము దమకు వంశపారంపర్యముగ సంక్రమించిన కాణయాచి యనియు విజయనగర ప్రభువులు దమ రాజస్వమున క్రమముగ నాక్రమించిరనియు విశ్వసించి సాళువ నరసింహరాయల కాలమునుండియు సమయ మనుకూలపడినపు డెల్ల వారు స్వతంత్ర పతాకము నెత్తుచు వచ్చిరి. సాళువ నరసింహరాయలు నరసా నాయకుడు, వీరనరసింహరాయలు, కృష్ణదేవరాయలు మున్నగు రాయ సింహాసనాధిపతు లొక్కొక్కరును వీరిలో పోరాడక తప్పినదికాదు. అచ్యుతరాయలు సింహాసనము నధిష్ఠించిన వెంటనే రాయ సామ్రాజ్యము నందుప్పతిలిన కళవళమునదను జేసికొని పూర్వుల మార్గము ననుసరించి యుమ్మత్తూరు ప్రభువు రాయలను ధిక్కరించి తన స్వాతంత్ర్యమును ప్రకటించెను. ఇతని పేరెద్దియో తెలియదు. కాని యప్పటి శాసనములను బరికించి చూడగా నుమ్మత్తూరు రాజవంశమునకు జెందిన వారిరువురు గాన వచ్చుచున్నారు. ఇరువురును మల్లరాజ నామధారులే. ఒక మల్లరాజు దేవణ్ణ ఒడయుల కొడుకు; ఇతడు వీరనరసింహ కృష్ణాచ్యుతుల సామంతుడు; మఱి యొకడు మంగపరాయల పుత్రుడు. గజబెంటకార, గెణాంక చక్రేశ్వర, జవాది కోలాహల, యరసంక సూనె గారేత్యాది బిరుదాంకితుడు. వీరిద్దరిలో నెవ్వరు రాయలపై దిరుగుబాటు చేసిరో నిశ్చయించి చెప్పుటకు వలనుగాదు; కాని బిరుదుల పటాటోపమును జూడగా రాయలవిూద కత్తిదూసి నాతడొకవేళ నీ మంగపరాయల పుత్రుడే కావచ్చునను యూహ పొడము చున్నది. వాస్తవముగ దిరుగుబాటు చేసిన దేమల్లరాజయినను తక్కినవాడాతని ధాటి కాగజాలక దేశ త్యాగముజేసి పాఱిపోయి యచ్యుతరాయల శరణు జొచ్చెను. ఉమ్మత్తూరు ప్రభువుయొక్క దౌర్జన్యమున కోహటించి రాయల యాస్థానమునకు పాఱిపోయిన కర్ణాట ప్రభువు మల్లరాజొక్కడే కాడు. నుగ్గిహళ్ళి పాలకుడైన రాయణరాజును, మఱియొక సంస్థానాధిపతియైన వెంకటాద్రియును అతని ననుగమించిపోయి రాయసంరక్షణను కోరిరి.

అచ్యుతరాయలు శ్రీరంగమునుండి బయలువెడలి కావేరీ తీరమున దండు నడపుకొని పోయినదీ యుమ్మత్తూరు మల్లరాజును శిక్షించి కర్ణాటకముపై దన యాధిపత్యమును మరల నెలకొల్పుటకును రాజ్యభ్రష్టులై పాఱివచ్చి తన్నాశ్రయించిన కర్ణాటక సామంతులను వారి స్వస్థానములందు పునః ప్రతిష్ఠించుట కొఱకె; కాని యీ యుద్ధ యాత్రా సందర్భమున నడిచిన వృత్తాంత మెద్దియును మనకు తెలియరాదు. లబ్ధమైన చరిత్రాధారములను బట్టి చూడగా రాయలకె జయము కలిగినట్లు తోచు చున్నది. రాజనాథ డిండిముడు తన యచ్యుత రాయాభ్యుదయమునందు రాయలు నిరాటంకముగ నుభయ కావేరీ మధ్యమందలి శ్రీరంగ పట్టణమును జేరెననియు నా పట్టణ పాలకు డసర్హ్యమైన కానుకలను సమర్పించెననియు జెప్పియున్నాడు, మఱియు క్రీ శ. 1532 జూలై మాసాంతమునందు అచ్యుతరాయలు శ్రీ కాళహస్తియందు కాళహస్తీశ్వరుని కోవెలయందు నెలకొల్పిన శాసనములలో దానుమ్మత్తూరు మల్లరాజు నుగ్గిహళ్ళి రాయణరాజు, వెంకటాద్రి మొదలైన సామంతులను చెక్కుచెదరను సంరక్షించితిననియు, తిరువడిని రణరంగమున నోడించి యతని దన కరిగాపుగజేసికొంటిననియు, సాళువనాయక తుంబిచ్చి నాయకులను బరాభూతులను గావించి వశవర్తులుగ జేసికొని తామ్రపర్ణీతీరమున జయస్తంభమును బ్రతిష్ఠించితిననియు బాండ్య రాజపుత్రికను బెండ్లాడి యతని నిజరాజ్యమున బునఃప్రతిష్ఠితుని గావించితి ననియు బ్రకటించియున్నాడు.

## విజాపుర దండయాత్ర

రాజనాథ డిండిమకవి యచ్యుతదేవరాయలు శ్రీరంగపట్టణమునుండి విజాపుర రాజ్యముపై దండు నడుపుకొనిపోయెనని వ్రాసియున్నాడు. కాని శాసన సాక్ష్యమును బరికించి చూడగా నిది వాస్తవముగాదని తోచుచున్నది. క్రీ. శ. 1532జూలై మాసములో నచ్యుతరాయలు కంచికి వచ్చి యచ్చట కొంతకాల ముండెను. అప్పుడతనితోగూడ నతని పట్టమహిషి వరదాంబికయును యువరాజు కుమారవెంకటాద్రియు విచ్చేసియుండిరి. అచ్యుతరాయ లప్పుడు వరదరాజస్వామిని సందర్శించి స్వామికి పదునాల్గు గ్రామములను దానము జేసెను. పట్టమహిషితోడను, యువరాజుతోడను గూడి మౌక్తిక తులాభారము దూగి గోసహస్రమును బ్రాహ్మణుల కర్పించెను. కంచినుండి బయలువెడలి జూలై మాసాంతమున గాళహస్తిజేరి యచటనుండి చంద్రగిరికిబోయి కొంతకాల మచట నుండెను. చంద్రగిరి నధివసించి

యుండగనే క్రీ. శ. 1533 ప్రారంభమున తిరుపతి కేగి వేంకటాచలపతిని సందర్శించి పెక్కు దానములను గావించి వేంకటేశ్వర కనర్ఘ్యమైన కానుకలను నాభరణములను సమర్పించి యచటినుండి 1533 ఫిబ్రవరిలో విజయనగరమునకు వచ్చిచేరెను. అచ్యుతరాయలు విజాపురముపై దండువెడలినది. యటుపిమ్మటనేకాని యంతకుముందు కాజాలదు.

ఈ దండయాత్ర విశేషములను దెల్పెడి యాధార గ్రంథములు ముఖ్యమైనవి. రాజనాథ డిండిమ కవి విరచితమగు నచ్యుతరాయాభ్యుదయ మొకటి. బారాసను పోర్చుగీసు చరిత్రకారుడు వ్రాసిన 'ఏషియా' యను గ్రంథము రెండవది. ఇవిగాక దక్కను మహమ్మదీయ చరిత్రలయందును నీ దండయాత్రకు సంబంధించిన విషయములు కొన్ని తెలియుచున్నవి, ఇంతవఱకు నుపలబ్ధమైన సాక్ష్యమునంతటిని క్రోడీకరించి చూడగా నీ దండయాత్ర వృత్తాంతమిట్లు తెలియ వచ్చుచున్నది. విజాపుర సుల్తాను ఇస్మాయీల్ ఆదిల్ షాహ క్రీ. శ. 1533 లో గోల్కొండ రాజ్యముపై దండెత్తిపోయి యా రాజ్యమునకు చెందిన కోవెలకొండ దుర్గమునకు ముట్టడివేసెను. ముట్టడి యింకను జరుగుచుండగనే ఇస్మాయీల్ ఆదిల్ షాహ జ్వరపీడితుడై నిజశిబిరమందు మృతినందెను. ఇతనికి పుత్రులిరువురు కలరు. పెద్దవాడు మల్లు, రెండవవాడి బ్రాహీము. శత్రుదేశమున రణక్షేత్రమున వైరివర్గముచే సమాక్రాంతులై యున్నను రాజ్యాధిపత్యమునకై యా యన్నదమ్ములిద్దఱు నొండొరులపై కత్తులదూసి కలహమునకు సంసిద్ధులైరి. అంతట నిస్మాయీల్ ఆదిల్ షాహక్రింద నాదిల్ షాహి రాజ్యమున కంతటికిని సర్వాధికారియై యుండిన పారసీక మహమ్మదీయ యోధుడు ఆసాద్ఖానుడు ముట్టడిని లేవదీసి కొని నిజరాజ్యమునకు మరలిపోయి తన కిష్టము లేకపోయినను రాణివాసము యొక్కయు యమీరుల యొక్కయు యిష్టము చొప్పున మల్లు యాదిల్ షాహను సింహాసనముపై నధిష్ఠాపితుని గావించెను. ఈయసాదుఖానుడు మనకు క్రొత్తవాడు గాడు, పరిచితుడే. ఇతడు మహామేధావియైన రాజనీతి కుశలుడు. కుట్ర సేయుటయం దితని నేర్పు నన్య సామాన్యము వంచక వంచకుడు; జిత్తులలో జంబుకములకు చదువు చెప్పగలవాడు. కావున మల్లు యాదిల్ షాహ నకితని ప్రవర్తనయెడ సంశయము గలిగెను. తత్కారణమున నతడు అసాదుఖానుని యధికారము బూర్వమువలె విశృంఖలముగ సాగనీయక కొన్ని కట్టుబాట్లకు లోబఱచెను. అందుపై నతడసంతృప్తుడై రాజస్థానమందలి తన యుద్యోగమును విసర్జించుకొని తన జాగీరైన బెల్గామునకు బోయి చేరి రాజ్యమందు పెక్కుతావుల జాగీరుల ననుభవించుచుండిన లాతి మహమ్మదీయ ప్రభువులను సర్దారులను సుల్తానుపై దిరుగుబాటు సేయ బురికొల్పెను. అతని కుట్రల మూలమున విజాపురరాజ్యమందంతటను అల్లరులు చెలరేగినవి. వాని నణచి మరల దన యధికారమును నిర్నిరోధముగ బ్రతిష్ఠించుటకు సుల్తానునకు శక్యము గానట్లు తోచెను.

విజాపుర రాజ్యములో ప్రబలుచుండిన యల్లరులను అదను జేసికొని కృష్ణా తుంగభద్రల యంతర్వేదిని మరల స్వాధీనపఱచుకొనుట కదియె తరియని యచ్యుతరాయలు వెలిగు దారము వేయించి దండయాత్రకు బయలువెడలెను. రాజ్యమునందు చెలరేగిన యల్లరులకు దోడు రాయలు గూడ విత్తివచ్చుచున్నాడని విని మల్లు ఆదిల్ షాహ అసాదుఖానుని రాజధానికి మరల రమ్మని యాజ్ఞాపించెను. కాని యాతడు రాజాజ్ఞ మేరకు రాజధానికి బోకపోవుటయే కాక పోర్చుగీసులతోడను, రాయలతోడను కుట్రలు సేయగడగెను. అంతట నతడు 13000 పదాతులతోడను, 200 యేనుగులతోడనువచ్చి రాయల దర్శనము జేసికొనెను. రాయలాతని చక్కగ నాదరించి యాతని మనోవర్తికొఱకు తుంగె తురుగలులను రెండు పట్టణములనుం బళిగ నిచ్చెను.

అచ్యుతరాయలు సైన్యముతోగూడ నాసాదుఖానుడు నిజపరివారముతో వెంట నడువగా మత్తరాభిముఖుడై విజాపుర రాజ్యముపై దండుచేసి దుర్గములను నేలమట్టమునకు బడగొట్టి పట్టణములను బరశురామప్రీతి సేయుచు దేశమును చూఱపట్టుచు సర్వనాశనము గావించెను. మల్లుయాదిల్ఖానుడు సైన్యముతోగూడ బయలువెడలివచ్చి రాయల నెదుర్కొనెను. అసాదుఖానుడు తాను రాయలను త్యజించి మరల తురకలను జేరెనని ప్రమాణ పూర్వకముగ వాగ్దానము జేసియుండినను ద్రోహము దలపెట్టి మల్లుయాదిల్ షాహతో నతిగాఢముగ సంధి సంభా

షణలు సేయ నారంభించెను. అచ్యుతరాయలతని ద్రోహ ప్రవర్తన నెఱిగి యతని బంధింప ప్రయత్నము సేయగా నతడు నిజపరివారముతో గూడ తప్పించు కొనిపోయి మల్లూ యాదిలానుని గూడెను. తరువాత నుభయపక్షముల సైన్యములను రాయ చూరువంక నడువ నారంభించినవి. అచిరకాలము ననే యొండొంటిని తారసిలుటవలన ఘోర సంగ్రామము సంఘటిల్లినది. యుద్ధమున మహమ్మదీయులు పరాజయము నందిరి. మల్లూ యాదిల్‌శాహు రణ రంగమునుండి యెంటరియై పాఱిపోయెను. అచ్యుత రాయలు శత్రువుల యేనుగులను, గుఱ్ఱములను బెక్కింటిని గైవసము జేసికొని, కృష్ణానది దక్షిణపు టొడ్డున విడిసి యెదుటి యొడ్డున మరల దళములను గూర్చు కొనుచుండిన యాదిల్‌శాహుయొక్క ప్రవర్తన నారయు చుండెను. కాని పరిస్థితు లిట్లుండగనే యుద్ధము హటాత్తుగ పరిసమాప్తినందెను. అందులకు గారణము పై బేర్కొనిన యసాద్ఖానుడే అతడు రాయలశిబిరము నుండి పాఱిపోయి మలూ షాహును జేరినను నతనియెడ ద్రోహ చింతను మానలేదు. మల్లూను పదభ్రష్టుని గావించి యతని స్థానమున నతని తమ్ముడైన ఇబ్రాహీమును సింహాసనము నెక్కించుటకు రహస్యముగ కుట్రలు సేయగడగెను. అతని దుష్ప్రవర్తన దెలియ వచ్చినంతటనె రాయలంతటి ప్రబలునితో యుద్ధ కార్యము నడపుట సుంభసాధ్యముగాదని నిశ్చయించి రాయచూరునకు బ్రత్యామ్నాయముగ మఱియొక రాజ్యమును రాయలకిచ్చి సంధి చేసికొనియెను

ఈ యుద్ధమునం దచ్యుతరాయలకే జయము చేకూరినట్లు రాజనాథ డిండిముడును, బోర్చుగీసు చరిత్రకారులును దెల్పుచున్నారు. కృష్ణాతుంగభద్రల యంతర్వేదియు రాయచూరు దుర్గమును విజయనగర సామ్రాజ్యపు టుత్తర సరిహద్దునం దాయవట్టు స్థానములు. అట్టియెడ నచ్యుతరాయలు రాయచూరునకు బ్రత్యామ్నాయముగ మఱియొక రాజ్యమును గొని దానిని దురకల కేల వదలిపెట్టెనో తెలియదు; కాని యప్పుడు కాకపోయినను దరువాత శీఘ్రకాలమునందే దానిని స్వాధీనము జేసికొనెననుటకు గొంత యాధారము గలదు. క్రీ. శ. 1535–6 లో నిబ్రాహీం ఆదిల్‌శాహు తన యన్నయగు మల్లూను దొలగద్రోసి బిజాపుర సింహాసనము నాక్రమించుకొనెను. తరువాత నతడు క్రీ. శ. 1537—38 విజయనగరముపై నెత్తివచ్చినప్పుడు అతడు తనకు ధనకనకవస్తువాహన ములతోపాటు రాయచోట (రాయచూరు)ను గూడ రాయలు సమర్పించిన దాను ముట్టడి లేవదీసికొని పోయెదనని యతడు తెల్పెనని న్యూనిజు వ్రాసి యున్నాడు: ఇది విశ్వాసపాత్రమగునేని యచ్యుత దేవ రాయలు క్రీ. శ. 1535 లో మల్లూయాదిల్‌ఖాను నితో సంధి జేసికొనిన తరువాతను 1537–38 లో నిబ్రాహీమాదిల్‌షాహు విజయనగరమును ముట్టడించుటకు ముందును నెప్పుడో యొకప్పుడు రాయచూరును ముట్టడించి స్వాధీనము జేసికొని యుండవలయును.

పై జెప్పినట్లచ్యుత రాయలు ఆదిల్‌షాహు నోడించియు రాయచూరు దుర్గము పట్టుకొనక యతనికె వదలిపెట్టి విజయనగరమునకు మరలి వచ్చుట కొక కారణమగపడుచున్నది. అది గుత్తి దుర్గమున రేగిన యల్లరి. అచ్చుట తిమ్మానాయకుడును నమర నాయకుడు కోటను స్వాధీనము జేసికొని యచ్యుత రాయల యధికారమును సాగనీయక యద్దుపెట్టెను. ఇతడెవ్వడో నిశ్చయించి చెప్పుటకు వీలుగాకున్నది. ఒక వేళ నితడు గండికోట ప్రభువైన పెమ్మసాని తిమ్మానాయడైనను గావచ్చును. అగునేని యితడు రామరాజునకు మిత్రుడు. అచ్యుతరాయలపై నితడేల తిరుగు బాటు చేసెనో తరువాత వివరించెదను. రాయచూరు నుండి విజయనగరమునకు వచ్చిచేరిన వెంటనే యచ్యుత రాయలు గుత్తి దుర్గముపై నెత్తిపో నిశ్చయించి దళములను సమకూర్చి తన బావమఱదియైన సలక రాజు తిమ్మరాజునకు సైన్యాధిపత్యమిచ్చి వెలిసుడారము వేయించెను. తరువాత నల్పకాలమునందే సైన్యమును నడపించుకొని గుత్తినిచేరి దుర్గమునకు ముట్టడి వేయించెను. ముట్టడి కార్యవేగముగ నడచినది. కొలది దినములలోనే సలకరాజు తిమ్మరాజు కోటగోడను తట్టు పగులగొట్టి లోపల బ్రవేశించెను. రాయరాణువ తాకునకు నిలుపోపక దుర్గ సంరక్షకులు కోటను రాయలకు వశపఱచిరి. విజయమును జేకొని యచ్యుత రాయ లచటి నుండి బయలువెడలి క్రీ. శ. 1535వ సంవత్సరాంతమున తిరుపతికి జేరి వెంకటేశ్వరుని దర్శించి యచట మహాలక్ష్మి మహోత్సవమును పునర్వసు తిరునాళ్ళను రెండు ఉత్సవములను జరుపుటకు తగు నేర్పాటులను గావించెను. తరువాత మరల రాజధానికి బయలువెడలి శకాబ్దము 1458

దుర్ముఖి కార్తీక శు 12 (క్రీ. శ. 1536) నాటికి వచ్చి చేరి, తుంగభద్రా తీరమున విఠ్ఠలేశుని సన్నిధియందు ఉదయగిరి రాజ్యమునందలి పోరెపల్లె యను గ్రామమును చింతలపల్లి యన్నమ యను బ్రాహ్మణున కగ్రహారమున దాన మిచ్చెను.

ఇంతవఱకు నచ్యుతరాయల రాజ్యపాలన విజయ వంతముగ సాగినది. తరువాత నతని ప్రభుత్వ మొదు దుడుకులకు లోనాయెను. దీనికి కారణము రామరాజు తోడి వైరము. కృష్ణరాయల కుమారుడైన పదు నెనిమిది మాసముల యర్భకుని ముందుంచుకొని యతని పేర సింహాసనము నాక్రమించుకొని సామ్రా జ్యము నేల బ్రయత్నించుటచేత నచ్యుతరాయలతనితో సంధి జేసికొని రాజ్యపాలన మందతని దనతో సమాన భాగస్వామిగా జేకొనవలసి వచ్చెనని యింతకు ముందు వివరించి యున్నాడను. ఆ యర్భకుడు సజీవుడై యున్నంతకాలము నీ యేర్పాటు నిర్వ్యక్రమ గ సాగినది. కాని మూడేండ్లు గడచిన పిమ్మట క్రీ శ. 153 – 35 లో నా బాలుడు వ్యాధిగ్రస్తుడై మృతి నందెను. అంతట నచ్యుతరాయలకు రామరాజును దనతో సమా నాధికారము గల భాగస్వామిగ నుండవలసిన యావశ్య కత తీరిపోయెను. మఱియును దన బావమఱదులగు సలకరాజు పుత్రులయిన పెద చినతిరుమలరాజులను జేరదీసి వారికి రాజ్యపాలనము నప్పజెప్పెను. క్రీ. శ. 1534 లో బెద తిరుమలుని దనకు బ్రధానిగ జేసికొనెను. తర్వాత స్వల్పకాలము లోపలనె యతనికి సర్వశిరః ప్రధాని పదము గూడ నిచ్చెను. చిన తిరుమలుని సైన్యాధిపతిగ నియమించెను. సాళువ నాయకుని మీది దండయాత్రయు గుత్తి దుర్గ ముట్టడియు నితని నాయకత్వము క్రిందనె నడచెను. సకలరాజు పుత్రు లిట్లు తన కార్యమునకును ఖడ్గమునకును గర్తలు కాగా నచ్యుతరాయలు రామ రాజును సరకుసేయక రాజ్య పాలన జేయగడగెను.

రామరాజు దూరదృష్టిగల రాజనీతివేత్త. భావి కాలమున రాగల క్లిష్టసమస్యల నూహించి వాని నెదుర్కొనుటకు దగిన నదుపాయములను ముందే కల్పించుకొను శక్తిగల ధీమంతుడు. కావున నతడు దనచేత నధికార ముండునప్పుడే రాబోవు నిక్కట్టు లను దొలగించుకొనుటకు వలసిన యేర్పాటులను ముందే జేసికొనెను. మహమ్మదీయ చరిత్రకారు లీ విష యమును జక్కగ వివరించియున్నారు. వీరిలో మొదట పేర్కొనదగినవాడు రఫియుద్దీన్‌షీరాజియను పారశీ కుడు. ఇతడు రామరాజు నెఱుగును. రక్షసి–తంగడి యుద్ధమునకు ముందొకసారి విజయనగరమునకు బోయి యుండెను. ఇతడు రామరాజును గూర్చి యిట్లు వ్రాసి యున్నాడు. 'రామరాజు కృష్ణరాయల కొడుకు పేర మూడు సంవత్సరములు రాజ్యపాలన మొనర్చెను. అప్పుడతడు ప్రాత దొరలను నుద్యోగులను నగరి పద వులనుండి తొలగించి వారి స్థానమున దన బంధువు లను గొప్ప యుద్యోగములందు ప్రవేశపెట్టెను'— ఇట్లే ఫెరిష్తా కూడ రామరాజు క్రమక్రమముగ 'ప్రాచీనకాలమునుండి నగరి కొలువునందుండిన దొరల నెల్ల నాశ మొనర్చి స్వకీయ బంధు వర్గమును రాజ్యమునందున్నత పదవులలో బ్రతిష్ఠించె'నని వ్రాసి యున్నాడు. పేరు తెలియరాని గోల్కొండ కుత్బ్‌షాహీ చరిత్రకారుడు సైతము రామరాజు కృష్ణరాయల పుత్రునికి బాసై రాజ్యము సేయుచుండిన కాలమున దనకహితులైన పొరుగు రాజులను పట్టుదలతో జయించి స్వాధీనపఱచుకొని తన యనుచరులను బంధు వులను నున్నతోద్యోగములందు నియోగించెనని వక్కా ణించియున్నాడు. రామరాజు మిత్రులలో బెక్కండ్రు దొరలును నమర నాయకులును గలరు. గండికోట పెమ్మసాని తిమ్మానాయకుడును, అనంతపుర హండే హను మప్పనాయుడును, నడిమిదొడ్డిపాళెపు మేసా పెద్దా నాయుడును, నల్లూరి మజ్జూరి తొళసిరెడ్డియు వీరిలో బ్రముఖులు; మరియు రామరాజు సోదరులు ఎఱతిమ్మ రాజును వెంకటాద్రియు నతనికి బాసటయై కుడి యెడమ భుజములవలె వర్తిలుచుండిరి. దూరజ్ఞాతు లైన నందియాలవారును సన్నిహితులైన యవుకు వారును సమయ మనుకూలమైనపు డతనికి దోడ్పడ సంసిద్ధులై యుండిరి. మిత్రుల సహాయ సంపత్తి యెంతయుండినను తనకడక నెఱవేరుటకు సైన్య బల మావశ్యకమని గ్రహించి దాని సమకూర్ప దల పెట్టెను. విజాపుర రాజకీయము లతని కీ సందర్భమున మిక్కిలియు ననుకూలించినవి. ఇబ్రాహీమాదిల్‌షాహు క్రీ. శ. 1535 సంవత్సరమున దన యన్నయైన మల్లూయాదిల్‌షాహును బ్రద్దియ డిగ్గద్రోసి కన్నులు బొడిచి యంధుని గావించి సింహాసన మాక్రమించు కొనెను. ఇబ్రాహీంషాహు మహమ్మదీయులలో సున్ని సమయమునకు జెందినవాడు. విజాపుర సైనికులలో

బహుసంఖ్యాకులు పారశీకులు. వీరందఱును షియా సంప్రదాయము ననుసరించు వారగుటచేత వీరిని తన కొలువునుండి తగరు గావించెను. ఇట్లు పదచ్యుతులైన పారశీక సైనికులలో మూడు వేలమందిని రామరాజు తన కొలువున జేర్చుకొనెను. తమ మతాచారములకు విరుద్ధము లేక వారు తనకు మ్రొక్కుటకొఱకు తనకు గద్దెముందర నొక కొరాను సంపుటమును బెట్టించెను. ఈ మూడు వేల సిపాయీలను నార్గురు నాయకుల యధికారముక్రింద నుండిరి. సిపాయీలకు జీవితములును నాయకులకు జాగీరులను నేర్పఱచి వారిని గౌరవముతో నాదరించెను. వారు రాజధాని విజయనగరములో దురకవాడ యను నొక ప్రత్యేక నగర ప్రాంతమున దాము వసించుటకు గృహములను విపణి వీధులను, నమాజు కొఱకు మసీదులను నిర్మించుకొనిరి. అచట వారు నిరాటంకముగ దమ మతాచారముల నాచరించనగును; పశువధగూడ సేయవచ్చును.

అచ్యుత దేవరాయలు క్రీ. శ. 1536 లో దిరుమలనుండి తిరిగి వచ్చిన తరువాత రాజధానిలో నడచిన వర్తమానము లెవ్వియు స్పష్టముగ దెలియరావు. కాని లభించిన సాక్ష్యలేశమునుబట్టి చూడగా రామరాజు స్వయము పట్టాభిషేకము జేసికొని తానె రాయలై తన పేరనే రాజ్యము పరిపాలించుటకు ప్రయత్నము సేయగా సామంతులును దొరలును ప్రతిఘటింప రాజధానిని త్యజించి పెనుగొండకు బోవలసి వచ్చినదని తెలియుచున్నది. రామరాజన కాశ్రితుడును దన్నామాంకితుడును నైన రామరాజభూషణుడు స్వవిరచిత వసుచరిత పీఠికయందు 'పట్టాభిషేక విపర్యయంబున బ్రోలు వెడలి ప్రియానుజుల్వెంట గొల్వ॥ జిత్రకూటాఖ్య జెలగు పెన్గొండ...జెంది' యను సీసపాదములందు వక్కాణించి యున్నాడు. హండె అనంతపుర చరిత్రయందు కృష్ణరాయల దేవేరులైన తిరుమలదేవి చిన్నాదేవుల యవష్టంభము వలన నిది జరిగెననియు సలకం తిమ్మయ్య ప్రతిఘటన వలన కొనసాగక పోయెననియు బెప్పియున్నది. 'అతని (కృష్ణరాయుల) భార్యలు తిరుమలదేవి చిన్నాదేవి అనే వారు యిద్దరు. వీరికి ఆడబిడ్డలు మాత్రము కలిగి వున్నందున, తిరుమలదేవి కొమార్తైను రామరాయలున్ను, చిన్నాదేవి కొమార్తైను అతని తమ్ముడైన తిరుమల రాయలున్ను వివాహము చేసుకొనిరి. పిమ్మట ఆ దొరసానులు యిద్దరున్ను ఆ రామరాయల వారికి అళియ పట్టము కట్టవలెనని సంకల్పించి వుండిరి. ఇంతలో లోగడ సంస్థానంలోవున్న బొక్కసం గొల్ల సలకం తిమ్మయ్య అనేవాడు, రాజ్యము అరాజకమై బొక్కసం తన స్వాధీనములో వున్నందున, చతురంగ బలన్ని వదిల పఱచుకొని, అల్లుండ్లయిన రామరాయ తిరుమల రాయలను పట్టి చెర వుంచవలెనని యోచించెను. ఈ వర్తమానమును వారు విని, ఆ దేశమును విడిచి పారిపోయి పెనుగొండ సంస్థానములో సంచరించుచు, కొంత సైన్యమును కూర్చుకొని ... విద్యానగరమునకు దండెత్తి వచ్చిరి.' వసుచరిత్రవలె హండె అనంతపుర చరిత్ర సమకాలిక రచన కాదు. అది కైఫియతుల తరగతికి చెందిన యర్వాచీన గ్రంథము. అందు అనుశ్రుతముగ వచ్చు గాథలు పెక్కు చేరియుండును. ఈ గాథలు సందేహాస్పదములు. కావున సమకాల రచనల సాక్ష్యమునకు నవీన సాక్ష్యమునకును నొకే విధమున విలువ కట్టుట సరిగాదు. కాని పై రెంటికిని రెండు విషయములు సామాన్యము. ఒకటి రామరాజు పట్టాభిషేక ప్రయత్నము. రెండవది తద్విఘ్నమును పెనుగొండ వలసయు — ఇవి రెండును వాస్తవ చరిత్రాంశములని నిస్సందేహముగ మనము గ్రహించవచ్చును. రామరాజు కృష్ణరాయల కల్లుడని యన్య చరిత్రాధారములవలన తెలియుచున్నది. కావున కృష్ణరాయల రాణ లతనికి ప్రాపై పట్టము గట్ట యత్నపడుట సంగతమే. రామరాజు పట్టాభిషేకమును విఘ్నము జేసినవాడు సలకం తిమ్మయ్య యను బొక్కసం గొల్లయని చెప్పియున్నది. సలకం తిమ్మయను సలకయ తిమ్మయనియు, సలకము తిమ్మానూరుడనియు, సలకఖరుడనియు నప్పటి ప్రబంధ రచయితలు రామరాజు ప్రతిపక్షిగ చేర్కొని యున్నారు. ఇతడు బొక్కసం గొల్లకాడు — క్షత్రియుడు. అచ్యుతరాయల బావమరదియైన సలకరాజు తిరుమల రాజేకాని యన్యుడుగాడు. కావున పై గ్రంథ

ములవలన రామరాజు విజయనగర సామ్రాజ్యమునకు తాను రాయలుగ పట్టాభిషేకము జేసికొన ప్రయత్నము సేయగా నచ్యుతరాయల బావమరదియైన సలకరాజు తిరుమల రాజడ్డుపడి భగ్నము గావించె ననియు దత్ఫలితముగ రామరాజు తన తమ్ములతో గూడ విజయనగరమును వదలిపెట్టి పెనుగొండకు పోవలసి వచ్చునని తేలుచున్నది. మహమ్మదీయ చరిత్రకారులీ వృత్తాంతమును ధృఢపఱచుటయే గాక మఱి కొన్ని నూతనాంశములను దెల్పుచున్నారు. బుర్హాక్—ఇ—మ అసీరు రచయితయగు సయ్యిద్ అలీ తబా తబా 'రామరాజు తనపై దిరుగుబాటుచేసి యతని నోడించి చేజిక్కించుకొని కారాగారబద్ధునిజేసి రాజ్యము నాక్రమించుకొనె'నని వ్రాసియున్నాడు—ముహమ్మద్ కాసిం ఫెరిష్తా తన తారీఖులో 'రామరాజు తానే రాయలై తన పేరనే రాజ్యము నేల దలపెట్టెను; కాని సామంతులును దొరలు ప్రతిఘటించుట వలన నా యుద్యమమునకు స్వస్తిచెప్పి వారి యిష్టానుసారము ప్రవర్తింపగడగెనని వ్రాకుచ్చి యున్నాడు.

పట్టాభిషేక ప్రయత్నము భంగమైపోయినను రామరాజు రాజ్యాధికారమును విడిచిపెట్టలేదు. తాము కృష్ణదేవరాయల కల్లుడైనను తులు వంశజుడు గాకపోవుటచే సింహాసనము నెక్క నర్హుడుకాడని కదా సామంతాదులు ప్రతిఘటించిరి—వారి నడ్డపడనీయక రాజ్యాధికారము చెలాయించుట కతడొక మార్గము గనిపెట్టెను. అచ్యుతరాయలకు రంగరాయలను నొక యన్న యుండెను. అతడు కృష్ణరాయల రాజ్యకాలముననే మృతినందినను సదాశివరాయలను పుత్రుడుండెను. అతడభేద, శక్తిహీనుడు; కాని యచ్యుతరాయల జ్యేష్ఠభ్రాత పుత్రుడగుటచేత సింహాసనము నధిష్ఠించుట కచ్యుతరాయలకంటె నతని హక్కు శ్రేష్ఠతరమైనది. కావున రామరాజతని పక్షము వహించి యతనిని రాయలని ప్రకటించి యతని ప్రాపై యథాపూర్వము రాజ్యము సేయగడగెను. కాని రామరాజు కృత్రిమము సర్వత్ర యంగీకృతము గాలేదు. దక్షిణ దేశమున నాయకులు కొందఱు తిరుగుబాటు చేసిరి.

'మలబారు దేశమందలి రాజులు కొందఱు కప్పము నీయక తిరుగుబాటు సేయగా రామరాజు తానున్నత పదవికి దెచ్చిన యొక బానిసనికి విజయనగర రాజధానికి గాపువెట్టి గొప్ప సైన్యముతో వారి మీది కెత్తి పోయెనని ఫెరిష్తా చెప్పియున్నాడు. తంజావూరు నాయక రాజ్యస్థాపకుడైన చెవ్వప్ప నాయకుని తండ్రియైన చిన్నరాజను నతడు కృష్ణరాయల యల్లుడైన రామరాజునకు మంత్రి యాయెననియు నతడు రామరాజు నాజ్ఞప్రకారము సేతు పర్యంతగల ద్రావిడ రాజులను జయించి తంజాపురమును నెలవీడు జేసికొనె ననియు నొకా నొక నంజనగూడు శాసనమున జెప్పియున్నది. ఇందుదాహృతమైన నాయక వంశావళి యన్యత్ర గానవచ్చు వారి వంశావళికంటె భిన్నమైనదగుటచేత నిది కల్పిత శాసనమని తలంచుట కవకాశము కలదు. శాసనము కల్పితమైనను నందుక్తమైన చరిత్రాంశములు సత్యాత్మకములే కావచ్చునను పరిశోధక మహాశయుల సూక్తిననుసరించి పై శాసన సాక్ష్యమును గ్రహించవచ్చును. క్రీ. శ. 1537 వ సం॥న వ్రాయించిన తిరునెల్వేలి తామ్ర శాసనము సదాశివదేవ మహారాయల పక్షమున మహామండలేశ్వర రామరాజు విఠలదేవ మహారాజా ప్రాంత దేశమును పాలించుచుండినట్లు చెప్పియున్నది. ఈ విఠలరాజళియ రామరాజునకు జ్ఞాతి. అతని పెదతండ్రియైన అవుకు రామరాజు తిమ్మరాజు పుత్రులలో నొక్కడు; అతని ఖడమునకు కర్త. పై శాసనములు సాక్ష్యము ఫెరిష్తా చెప్పినట్లు క్రీ. శ. 1533 తరువాత రామరాజు మలబారు దేశముపై దండయాత్ర చేసినది వాస్తవమని రుజువు సేయుచున్నది. ఈ దండయాత్రకు గారణము మలబారు దేశప్రభువులు గప్పమీయక తిరుగుబాటు సేయుటయే యని ఫెరిష్తా నుడివి యున్నాడు. అట్లు తిరుగుబాటు చేసిన ప్రభువు లెవ్వరో యాతడు పేర్కొనలేదు; కాని యూహించి కనుగొన దుస్సాధ్యము గాదు. వారిలో దిరువడి రాజొక్కడై యుండవచ్చును. తామ్రపర్ణి దక్షిణ తీరము నుండి కొల్లము (Quilon) పర్యంతము వ్యాప్తమైన రాష్ట్రమితని యేలుబడి క్రింద నుండినది. ఇతడు

ముందొకసారి సాళువ నాయకునిగూడి యచ్యుత రాయలపై తిరుగుబాటుచేసి యుద్ధమున నిర్జితుడై యా రాయల యాధిపత్యము నంగీకరించి యుండెను గదా. విజయనగరమున జరిగిన విప్లవ సంఘటనల నదనుజేసికొని యాతడు నిజస్వాతంత్ర్యమును బునఃప్రతిష్ఠించుటకు బ్రయత్నించి యుండవచ్చును. అతనితోగూడ నా ప్రాంతమును పాలించుచుండిన ప్రభువులు మఱికొంద రేకీభవించి యుండవచ్చును. వీరి తిరుగుబాటు నణగగొట్ట రామరాజ విఠ్ఠలుని కొంత సైన్యముతో బంపించి రామరాజు విజయనగరమునకు మరలెను. కాని యాతని ప్రయాణము చిర వధికముగ సాగలేదు. మార్గమధ్యమున రాజధానికి దక్షిణమందున్న భూములు నేలుచుండిన జమీందా రొక్కనితో నతనికి బోరాటము గలిగెననియు, నాలు మాసము లతనితో బోరినను విజయము లభించక పోవుటయేకాక యుద్ధపు ఖర్చులకై కొనిపోయిన ధనము సర్వమున వ్యయమై పోవ నాతడు విజయనగరమందున్న తన ప్రతినిధిని రాయభండారమునుండి వలసిన ధనమునంప నాజ్ఞాపించెననియు, భండార మందలి ధన సంచయమునుగాంచి యా ప్రతినిధి దురాశాపీడితుడై తానే సర్వాధికారి కావలయునని యెంచి స్వామిద్రోహము దలపెట్టి యచ్యుతరాయ లను బంధ విముక్తు గావించుటయేకాక, సలకరాజు తిరుమలునితో జెలిమి చేసికొని రాయలపేర దానే రాజ్యాధికారము నడప గడగెననియు నంతట రామరాజు చేయునదిలేక తాను యుద్ధము సేయుచుండిన జమీందారునితో సంధి చేసికొని విజయనగరము చేర జనెననియు ఫెరిష్తా తెలుపుచున్నాడు. రామరాజు నిట్లు ముప్పుతిప్పలు బెట్టిన జమీందారు డెవ్వడో తెలియదు. ఇతడొకవేళ వాకిటి చిన్నప్ప నాయకుడై యుండిన నుండవోపు. చిన్నప్ప నాయకుడు రాజ్య మధ్యము నందు కొచ్చి దిశయందున్న భూముల నేలుచుండెనని న్యూనిజు చెప్పియున్నాడు. ఇంతేకాక యితడు మధుర ప్రాంతమును అచ్యుత రాయల పక్షమున క్రీ. శ. 1537—42 ల మధ్య పాలించుచుండిన గోళ్ల నాయకులకు మిత్రుడు. వీ రన్నదమ్ము లిద్దరు, పెరియ చిన్నరామప్ప నామాంకితులు. వీరు పచ్చకప్పురపు తిరువెంగళనాథుడను కవివరుని కాశ్రయ మిచ్చి యతనిచే తమ కిష్టదైవమైన మధుర చొక్కనాథ స్వామియొక్క లీలను వర్ణించు చొక్కనాథ చరిత్ర యను ద్విపద కావ్యమును వ్రాయించి యంకితము గొనిరి. అందు పెరియరామప్ప వాకిటి చిన్నభూవర సహితుడనియు నచ్యుత దేవరాయ ప్రతాపకార్య ధురంధరుడనియు నచ్యుత దేవరాయ ప్రతాప దక్షిణ బాహు దండాంకుడనియు స్వామి ద్రోహగండడనియు గీర్తింపబడియున్నాడు. ఇందుస్వామి ద్రోహగండ యనునది ముఖ్యముగ గమనింపదగినది. అచ్యుత రాయలకు ద్రోహము దలపెట్టినవారిలో రామరాజగ్రగణ్యు డగుట చేత నతని నోడించినందువల్లనే పెరియరామప్పకీ బిరుదు గలిగెనని తోచుచున్నది. ఫెరిష్తా యుద్దేశించిన జమీందారుడు వాకిటి చిన్నప్ప నాయకుడైనను కాకపోయినను సదరు చిన్నప్ప నాయకుడు నిజమిత్రులయిన గోళ్ల నాయకులతో గూడ రామరాజు నెదిర్చి యోడించెనని మన మనుకొనవచ్చును.

(సశేషము)

# "ఆరిక కూడదు"

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

'ప్రచేతంత అస్సాంను అయిదు రాష్ట్రాలుగా విభజించినపుడు అరటాకంత ఆంధ్రదేశాన్ని రెండుగా చీల్చితేమాత్రం మునిగిపోయేదేముంది?'— అని ఉన్నట్టుండి శ్రీమతి ఇందిరాగాంధి ఈ మధ్య మధ్యంతరం ఎన్నికల ప్రకటన చేసినట్లు ప్రకటించిందని వింటేగాడ అంత ఆశ్చర్యపడేవాడినికాను! కానీ ఆ మాటలు నా చెవుల్లో పడ్డప్పుడు కాలు నిలదొక్కుకొని నిలబడలేకపోయాను.

పనిగట్టుకొని పెంచిన పూలతోట అందంగా వుంది. అంతకంటె అందంగా వుంది ఆవరణలో మేడ! మరొకప్పుడైతే ఆ ప్రశాంతావరణము, గాలితో మేలమాడుతున్న పూ బాలలు...గుండె పరవశించి పోయేదేమో? కానీ ఓరగా మూసిన తలుపుసందున నుండి దూసుకొని వచ్చిన మాటలుమాత్రం నన్ను హడలగొట్టాయి—అక్కడ కుక్కలు ఘూర్కాలు లేకపోయినా!

ఆశ్చర్యంలో మునిగి అడుగు అటు యిటు కదల్చలేకపోయాను. ముందడుగు వేయువాడు మొనగాడు. వెనుకంజ వేయువాడు పిరికివాడు. అటో యిటో తేల్చుకోగలిగేది మొనగాడే! నీళ్ల నములుతూ నిలబడేది పిరికివాడు. అసలు పిరికి వానికే బోలెడన్ని ఆలోచనలు. అప్పటికే నేను ఆ యింటి ఆవరణదాటి వీధినపడి నడుస్తున్నానంటే—నే నెవరో మీకు తెలుసు!

నడుస్తున్నాను. నడుస్తూ ఆలోచిస్తున్నాను. ఆలోచిస్తూ అడ్డమైన వాళ్లమీద పడినట్లుపడి తప్పుకొంటున్నాను. 'బిడ్డ తప్ప తాగినట్లుందే! అన్న మాటలు వినడం తప్పకోలేక పోతున్నాను. ఆలోచనల నుండి తెప్పరిల్లుకోలేకపోతున్నాను. 'మనిషి చాల మట్టుకు, డబ్బును కాలాన్ని చాల జాగ్రత్తగా వాడుకొంటాడు'—అని బుజువు పరచుకోవడానికి ఆ స్థితిలో కూడ 'రైల్లు సౌకర్యమా? మోటారుమేలా? ఏది ముందు వెడుతుంది? ఎందులో పదిపైసలు తక్కువ?' అని వివరాలు అడిగి తెలుసుకొంటున్నాను. ఆంధ్రదేశంలో కరువో, కాటకమో అని బస్సు చార్జీలు విపరీతంగా పెంచారని, ఒళ్లు గుల్లకాకుండా కొంప చేరాలంటే రైలేమేలని—బాటప్రక్కన మసాలావడలు అమ్ముకొనే ముసలిది చెప్పింది. కమ్మని మసాలా వడలాంటి కమ్మని మాట చెప్పింది. అంతమంచి సలహాకు కృతజ్ఞత తెలుపలేదని జగడ మాడడానికి పాపం! ఆ పాతకాలపు ముసలిదానికి తెలియదు. బదులుగా రెండు వడలు కొనుక్కున్నాను, ఆలోచనమేతగా ఉపకరిస్తాయని.

రైలు సిద్ధంగా వుంది. నా కోసమే వేచి ఉన్నట్లుంది. పై చిల్లర డబ్బుగతి పరమాత్మ ఎరుగునని టిక్కట్టు చేతికందడమే తరువాయిగా ఒక్క అడుగులో బండిలో పడ్డాను. బండి బయలుదేరింది. ప్లాట్ ఫారంమీద అయిదు నిముషాల అందమైన జాతర జరిపి; ఆ అయిదు నిముషాల జాతరలో కొందరిని యేడిపించి, మరి కొందరిని నవ్వించి సుఖదుఃఖాలకు, మోదఖేదాలకు అతీతుడైన వేదాంతిలా బిగ్గరగా నిట్టూర్చి రైలు బయలుదేరింది.

చేతిలో కమ్మని మసాలా వడలు...మనసులో తొలిచే ఆలోచనలు...ప్రజాసామ్యానికి ప్రతీకగా నిలబడివున్న ఆ మూడవ తరగతి రైలు పెట్టెలో అర్థంకాని రంపు...నిర్లక్ష్యంగా పరుగులుతీస్తూ వుంది రైలు. అందమైన ఆ యింటిముందు నిలబడ్డ రెండు నిముషాల్లో చెవుల్లోపడ్డ మాటలు మాత్రం తీపులు దీస్తున్నాయి! 'ఛీ ఛీ! ఎంత బుద్ధిహీనంగా ప్రవర్తించావు లక్ష్మీ!...ఆ ఉత్తరాన్ని చూచి వాడెంత కంగారుపడిపోయాడో?...ఏమంత కొంపలు మునిగిందని అలా రాశావ్? పాపం!...ఈ పాటికి వాడుకన్న తిప్పలు పడివస్తుంటాడు.'—రావడమేమిటి? వచ్చి వాకిట నిలబడి ఆ మాటలు వింటున్న సంగతి వాళ్లకు తెలియదు.

'వస్తే రానీయండి చెబుతాను. నేనేగదు— వాలాంటి ఆడది ఎవరైనా సరే! చిటికెడు విషం చింతలేకుండామింగి గుటుక్కుమంటుందికానీ, యిది సహిస్తుందేమో అడిగి చూడండి.'

'ఇంతకూ నేనేం చేశానని?'

'అబ్బ! పోనీలెద్దూ!! యింకనూ ఆ పాడు మాట లెందుకు? అదొక పీడకల. వదిలిపెట్టండి.'

'ఆవేశంతోకూడిన ఆలోచనలకు, ఆలోచనతో కూడిన ఆవేశానికి సామ్యం చూద్దామని!'

'మీా కవిత్వానికి సమాధానం చెప్పలేను కానీ పదిరోజులు నేను యింట్లో లేకపోయేసరికి పనిమనిషి కాటుక డబ్బా, కుంకుమ బరిణె, చేతిరుమాలు యింట్లో కనుపిస్తాయా? అదివంట మనిషో, యింటి మనిషో అర్థంకాక నా వళ్లు కంపరమెత్తింది. ఆ ఆవేశంలో నేనేం చేశానో నాకే తెలియదు. ఇంతకూ నిజం తెలియకుండా వుంటేనా?'

'ఉంటే యేంచేసే దానినో?'

'బోడి ఆడది యేం జేస్తుందండీ! చచ్చి వూరకుంటుంది.'

'ఆః! అలాగా!!'

ఆపై కిలకిలా నవ్వులు. చిలుకా గోరు వంకా కలిసి నవ్విన నవ్వులు! ఆ ప్రశాంత వాతావరణంలో నన్ను కలవరపెట్టడానికి నా మీాద రువ్విన నవ్వులు!...

రైలు పోతూనే ఉంది. ఆ మాటలు, నవ్వులు కలిసి నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. ఆలోచనలు రైలుతో పోటీ పడుతున్నాయి. అయితే రైలులాగ ముందుకుమాత్రం కాదు; వెనక్కు!...

చిట్టిబాబు, నేను, విజయలక్ష్మి ఒక తరగతిలో చదువుకొంటున్న రోజులవి. ఒక తరగతిలో చదువు కొంటున్నా ఒక తరగతికి చెందిన వాళ్లం మాత్రం కాదు. విద్యా విషయకంగా ప్రజాస్వామ్యం సాధించిన ప్రగతి యిది. విజయలక్ష్మిది సంపన్న కుటుంబము. సంపన్న కుటుంబములో పుట్టిన సంపెగ ఆమె! నేను మధ్య తరగతి వాడిని. చిట్టిబాబుమాత్రం కట్టకడపటి వాడు. అయితే తరగతిలో మొట్టమొదటి వాడు. దరిద్రుణ్ణి దూరంగా వుంచడం లోక సహజం. లోకంలోని దరిద్ర నారాయణ సంఘానికి వెరచి ఏడు కొండలవాడే ఏడుకొండల కవతల చేరాడట. కానీ చిట్టిబాబు చుట్టూ చాలమంది చేరేవారు.

ఓ నాటి ఉదయం నోట్లో పచ్చి మంచినీళ్లు కూడ పోయకముందే చిట్టిబాబు ఓ ప్రకటన చేశాడు. ఆ ప్రకటనతో నేను యేడవాలో నవ్వాలో తెలియలేదు. చేష్టలుడిగి చిట్టిబాబును తదేకంగా చూస్తూ నిలబడిపోయాను. చిట్టిబాబు!...ఓ పూట అంత తాడి మరో పూట కాసిని మంచి నీళ్ల ఫలహారంతో పూట గడిపే చిట్టిబాబు...ఉన్న రెండే రెండు జతల బట్టలను రాత్రి పూట మార్చి మార్చి ఉదుక్కొని చెంబు యిస్త్రీ చేయడానికి చెంబుకోసం పక్కింటి పిల వానితో స్నేహాన్ని పెంచుకొన్న చిట్టిబాబు...కాలేజీ ఆవరణలో వంచిన తలను పైకెత్తకుండా నడుస్తూ...గది వదలకుండా పుస్తకాల పురుగై మార్కులు ప్రోగుచేసుకొంటూ...'అబ్బ! ఎంత బుద్ధిమంతుడ'ని పేరు దెచ్చుకొన్న చిట్టిబాబు...ప్రేమిస్తున్నాడట!...నక్క ఊళవేసింది. నాకలోకం ఊహాపథంలో మెదిలింది. మహాగజేంద్రము మార్గమ్మున హుందాగా నడచింది. దోమ కనులముందు గిరికీలు కొట్టింది. భేదం కొట్ట వచ్చినట్లు కనుపించింది. అందుకే అడిగాను—

'నీవు చేస్తున్న పనియేమిటో నీకు తెలుసా?' అని.

'నే నామెను ప్రేమిస్తున్నాను. అంతే!' అన్నాడు చాల తేలికగా. నాకు కడుపుబ్బ నవ్వుతోపాటు అరికాలి మంట నెత్తికెక్కింది. అసూయతోమాత్రం కాదు. వీడి బ్రదుకంతా ఆమె చెప్పులకైనా సరిపోవునా? అన్న సందేహంతో.

'అది సరే బాబూ! ప్రేమించడం చాల తేలిక. ఈ కాలంలో అది గురువులేని విద్యకూడ. ఎందుకంటే రాస్తున్న నవలలన్నీ, తీస్తున్న సినిమాలన్నీ—ప్రేమ పాఠాల్ని నేర్పడమే పనిగా పెట్టుకున్నాయి గనుక. పోనీ! ఆమె నిన్ను ప్రేమించిందా?' అని అడిగాను.

'ఆమె ప్రేమిస్తే నాకేం? ప్రేమించకపోతే నాకేం? నేను ప్రేమిస్తున్నాను. అది నా తృప్తి!'— అంటూ అదో రకంగా చూశాడు నా కొత్త బోడి గుండువైపు. ఆ ముందు ముందు రోజే నేను వేంక

టేశ్వరుని సన్నిధానములో తలనీలాలు తీయించు కొన్నాను.' కాలేజీ గోడల్లో నీడ చూచుకొంటూ. దినానికి నాలుగుసార్లు నాజెంగా దువ్వుకొంటూ వుంటివే నీ ముద్దు ముద్దుల క్రాపును. ఈ నాడు సుద్దంగా కొటి పారేశావే! పోనీ! నీవు అంతభక్తిగా పూజించిన దేవుడు నీతో మాట్లాడాడా? కోరిన వరా లిచ్చాడా? మరెందుకు అలా చేశావంటే—అదీ నీ నమ్మకం! కదూ!!' అని గుచ్చి గుచ్చి అడిగినట్లుంది ఆ చూపుల్లో భావం. అందుకే మాట మార్చాను.

'ఏకపక్ష ప్రభుత్వమైతే కత్తికెదురుండదు కానీ యిది క్షేమకద నాయనా? దీనివలన యెవరికేం లాభముంటుంది?'

'ఎందుకుండదు? ఆమెను నా హృదయ సీమలో పదిలపరచుకొంటాను. చక్కని విరహ గీతికలు వ్రాసు కొంటాను. కమ్మగా పాడుకొంటాను. అది నాకా నందము.' ఆనందలహరిలో తేలిపోతూ అన్నాడు చిట్టిబాబ.

చిట్టిబాబు అద్భుతంగా కాకపోయినా ఓ మోస్తరుగా పాడుతాడని తెలుసు. విరహగీతికలు వ్రాస్తాడనిమాత్రం తెలియదు. 'అయితే వాగ్గేయకారుడవై పోయావన్నమాట!' ఎకసక్కెమాడింది వ్యంగ్యం.

చిట్టిబాబుకు కోపం వచ్చింది. కొర కొర చూశాడు నా వైపు.

'మీరంతా అనుకొంటూ వుంటారు—రచయితలంటే దైవాంశ సంభూతులనీ, పూర్వజన్మ సంస్కారం కలవారనీ!—దైవాంశము లేదు. గాడిద గుడ్డు లేదు. అవసరం ఆలోచింప చేస్తుంది. ఆలోచనలో భావం పుడుతుంది. భావానికి అందమైన భాష పేరే కవిత్వం!' 'అలాగా!...నాకు తెలియదే?... కాస్త చూపించు తండ్రీ నీ అవసరం ఎంత పని చేయించిందో చూద్దాం!' అని అడిగాను హేళనగా.

పండ్లూడిన వాడి దవడలా పదహారు సొట్టలు తిరిగిన తన పాతపెటెను తెరచాడు చిట్టిబాబు. అందులోనుండి అంతకంటే పాతదైన ఓ నోటు బుక్కును బయటికి తీశాడు. మాసిన పుస్తకంలో కాగితాలు బాగా నలిగి వున్నాయి. జాగ్రత్తగా పేజీలు త్రిప్పుతూ ఒక చోట ఆగి, ఒకసారి నా మొగాన్ని, మరోసారి ఆ పేజీని తదేకంగాచూచి ఆ పుస్తకం చేతిలో పెట్టాడు. చూశాను. చూడడమేం ఖర్మ? ఈ కడనుండి ఆ కడదాక జాగ్రత్తగా దృష్టి మరల్చ కుండా చదివాను. భావము భాష ఒక దానితో నొకటి పోటీపడుతూ సాగింది కవిత్వం. అది 'అవసరం' చేయించిన పనిగా తోచలేదు. ఆత్మానందంకోసం కవిత అనుకొంటే—అది అందులో వుంది. ఆశ్చర్య పడ్డాను.

అప్పటికే నేను ఒకటో అర కథలు వ్రాస్తున్న అలవాటు కలవాడిని. కాబట్టి అందరితో చనువుగ తిరిగేవాడిని. ఒకనాడు విజయలక్ష్మితో మాట్లాడుతూ వుంటే ఆమె అడిగింది 'ఏవండీ! మీరు కథలేనా రాయడం! పాటలేమీ రాయరా? అని. ఆ మాటలో చిట్టిబాబు మనసులో మెదిలాడు. అతని ప్రేమ వ్యవహారం మనసులో మెదిలింది. ఆపై అతని ప్రణయ కవిత్వం తలపును తాకింది. నాకు తెలియ కనే చిరునవ్వు నా పెదవుల పరామర్శించింది. నా నవ్వును అంగీకారంగా తీసుకొని ఆమె పాట విని పించమని పట్టుపట్టింది. పాటపాడాను. ప్రేమలో పడ్డ చిట్టిబాబు పాట పాడాను.

'అరె! మీరు పాటలుకూడ బాగా రాస్తారే!' ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది విజయలక్ష్మి.

'ఇది నా పాటకాదండీ! చిట్టిబాబు పాట!'

'నిజంగానా? చిట్టిబాబు పాటలుకూడ రాస్తాడా?'

'రాయడమేగాదు చక్కగా పాడుతాడుకూడా:'

'ఏదో పుస్తకాల పురుగనుకున్నాను. నిజంగా నాకు తెలియదే!'

కనురెప్పలు అలా అలా అల్లార్చి ముద్దు ముద్దుగా పలికింది లక్ష్మి.

'మీకు తెలియనివి యింకనూ చాలావున్నాయి.'— ధీమాగా అన్నాను, చిట్టిబాబు సాక్షాత్ ఈ విజయ లక్ష్మిని ప్రేమించడం దృష్టిలో వుంచుకొని.

'అయితే అతనిని మనింటికి ఒకసారి తీసుక రారాదూ !'

'ఒకసారేం ఖర్మ? మీరనుకొంటే వందసార్లు వస్తాడు.'

నిజంగానే వందసార్లు కాదు పదివందలసార్లు వెళ్లివుంటాడు చిట్టిబాబు ఆ పై విజయలక్ష్మి యింటికి. ఆ పదివందలసార్లలో వంద ప్రణయగీతాలు వ్రాశాడు. ఆ వంద గీతాలను విజయలక్ష్మి అందంగా అచ్చు వేయించింది. ప్రతి గీతానికి ఓ బొమ్మ గీయించింది. ఆ బొమ్మల్లో ఆడబొమ్మ తనది మగబొమ్మ చిట్టిబాబుదిగా వూహించుకొనింది. ఆ పై ఊహలకు ఊపిరిపోసి చిట్టిబాబును అమాంతంగా ప్రేమించింది. పెద్దలు కాదంటే కాదన్నారు. ఆమె అవునంటే అవునన్నది. ఒక్కగా నొక్క కూతురి ముచ్చట కాదనలేక పెద్దలు తలలు వాల్చేసరికి ఆమె కూడ తల వాల్చింది సిగ్గు బరువులో. తల వాల్చిన తరుణంలో చిట్టిబాబు గట్టిగా మూడు ముళ్లు వేశాడు. ఇంచుమించు ఆ పెళ్లికి పెద్దను నేను!

ఆ పై చిట్టిబాబు—అసలే బుద్ధిమంతుడైన చిట్టిబాబు బంగారుకు వాస నబ్బినట్లు కాగా బంగారు బాబయ్యాడు. బాగా చదివాడు మామగారి సాయంతో. బంగారంలాంటి ఉద్యోగాన్నే సంపాదించాడు. కలలుగన్న జీవితాన్ని కమ్మగా అనుభవిస్తున్నాడు. నేను నమ్మకమైన 'ఎన్జీవో' జీవితాన్ని భరిస్తున్నాను. సృష్టి చిత్ర మేమోమరి! కొందరి జీవితాలు సినిమా కథల్లాగ చిత్రవిచిత్రంగా మారిపోతూంటే — మరి కొందరి జీవితాలు ఓ గూటానికి కట్టుబడ్డ గొడ్డుల్లా ఆ గూటంచుట్టూ గిరికీలు కొడుతూనే వుంటాయి. కొందరి జీవితాలు నిత్యనూత్నంగా విచ్చి వికస్తూంటే—కొందరి జీవితాలు అలానే మోడువారిపోతున్నాయి. ఈ సమతా సాధనకు కవులు రచయితలు రాజకీయ నాయకులు ఎవరి తిప్పలు వారు పడుతున్నారు. అయినా ఒకరు ఎదగరు. మరొకరు తగ్గరు.

చదువు మమ్మల్ని ఒకచోట చేరవేస్తే జీవితం మమ్మల్ని మూలకొకరుగా విసరి పారవేసింది. దాని లక్షణమే అంత!—అయితే మాత్రం విజయలక్ష్మి చిట్టిబాబు లు నన్ను మరచిపోలేదు. వాళ్ల అనుబంధానికి కారణం నేనేనని వాళ్ల భ్రమ. పెండ్లిండ్లు ఈ లోకంలో నిర్ణయింపబడినవి కావని నా నమ్మకం. నేనే వాళ్లిద్దరికీ ముడివేశానని వాళ్ల నమ్మకం. వారానికో ఓ నిడుపాటి ఉత్తరం వ్రాయడం తప్పలితం.

విజయలక్ష్మి ఉత్తరం వ్రాస్తుంది. ఆమె ఎప్పుడు వ్రాసినా కవరే వ్రాస్తుంది. అదికూడ యెడమ వైపున చక్కని ఖాళీ స్థలాన్ని వదలి ముద్దుపెట్టుకొందామన్నంత ముచ్చటగా వ్రాస్తుంది. తీరా ఉత్తరం పూర్తిచేసేటప్పటికి అది అటు తిరిగి, యిటు తిరిగి, సూచనలు షరాలతోనిండి, 'అయ్యో! యిక కాస్త జాగా వుండివుంటే!' అన్న కొదువను మిగిల్చి పూర్తి అవుతుంది. ఆ ఉత్తరం నా టేబిలు మీద కనబడ్డప్పుడు ఆ రోజంతా పండుగే! ఆ రోజు ప్రభుత్వం యిస్తున్న జీతం దండుగే!

అలాంటి విజయలక్ష్మి కార్డు వ్రాసింది. ఒక్కటంటే ఒక్క వాక్యంతో కార్డు వ్రాసింది. రాజా! నువ్వు రెక్కలు గట్టుకొని యిక్కడ వాలకపోతే నా జీవితమేమవుతుందో నాకే తెలియదు! అన్న ఒక్కటే వాక్యంతో కార్డు పూర్తి చేసింది. రెక్కలు గట్టుకొని రకపోయినా, ముప్ప తిప్పలుపడి మా మేనేజరు మిడిగుడ్లు, మూతి విరుపులు, మెడవిరుపులు కిక్కురుమనకుండా భరించి మూడు రోజులు సెలవు సంపాదించి పుట్టి మునిగినట్టు పరుగెత్తి యింట్లో అడుగుపెట్టబోతే అడుగు ముందుకు కదలలేదు. నిలబడి విన్నాను. నవ్వాలో యేడవాలో తెలియలేదు. వాళ్ల వాదనలద్వారా తేలిన సారాంశమేమిటంటే?—అమ్మగారు పదిరోజులు ఊళ్లో లేకపోయారట! అయ్యగారు యింట్లో ఒంటరివాడేనట! ఒంటరి అయ్యగారికి తోడు వంట మనిషి. ఆ వంట మనిషి కాటుక డబ్బా, కుంకుమ బరిణె, చేతిరుమాలు యింట్లో అమ్మగారు అడుగుపెట్టేసరికి కనుపించాయట. కంపెరవెత్తి, కాలుగీరి, ఖణిల్లన అంకె వేసిందట—గోమాతలాంటి భారతనారి! మగధీరుడు మాత్రం సామాన్యుడా? అతడుకూడ సై అంటే సై అని వుంటాడు. అదృష వశాత్తు ఎలాగో నిజం తెలిసిపోయింది. చెలరేగిన స్పర్ధ పులిసిపోయింది. ఆ నిజం ఎలా తెలిసిందో తెలుసుకొనే అవకాశం నాకు లేకపోయింది. దాంలో నిమిత్తం కూడ నాకు లేదు. వాళ్ల జీవన స్రవంతి సాఫీగా సాగిపోవడమే నే నెప్పుడూ కోరేది.

వాళ్లఅన్యోన్య దాంపత్యము,...కలిగిన చిన్న అంతరాయము...అంత చిన్నసంగతి ముందు వాళ్ల యేళ్ల తరబడిగ సాధించిన పరస్పరావగాహన వీగిపోవ డము...వాళ్ల రేగిపోవడమూ...అంతా చిత్రంగా కనుపి స్తూంటే ఆలోచిస్తూ కూర్చున్నాను. రైలు అక్కడ డక్కడ ఆగుతూ సాగుతూ పోతూనే వుంది.

'ఏమిటిది?' రైలు శబ్దాన్ని మించిన గద్దింపు చెవిని పడింది.

ఆలోచనలను ఆటకెక్కించి చూద్దును గదా! ఎదుటు సీట్లో...అల్లంతనవ్వులో ఒకావిడ! ఎడమ చేతిలో సగం తెరచిన పెట్టెను పట్టుకొనివుంది. కుడి చేతిలో ఓ కొత్తచీర వుంది. సగం తెరచిన పెట్టె నుండి చల్లగ సంగ్రహించిన బిస్కట్‌పొట్లంతో యిద్దరు పిల్లలు రాజీ పడుతున్నారు. ఆమె, ఆమె భర్తలాంటి మగవాడు చీరతో పోటీ పడుతున్నారు.

'ఎందుకండీ అట్లా గుడ్లు మిటకరిస్తారు? వినిపించలా?...అడుగుతున్నది మిమ్మల్నే!'

'చెల్లాయికి...' నీళ్లు నములుతున్నాడతడు.

'సంతోషించాం! ప్రియురాలి కనలేకపోయారూ? మారు కట్టుకోడానికి చీరలేక మగ్గిపోతున్నా, ఒక్క చీరపేలికకోసం వందసార్లు మొత్తుకొన్నా చెవిని పడదు. ఆ పిల్ల వాళ్లని చూడండి, కొడుకులని చెప్ప కోడానికే సిగ్గేస్తుంది. అయినా చెల్లాయట!... చెల్లాయ్!!...హుఁ! ఇంతకూ ఒకరినని యేం ప్రయో జనం? నా రాత సరిగ్గా రాసి యేడ్చివుంటే నేనీ యేడు పులు యేడవవలసి వచ్చేదిగాదు!'

అది రైలుపెట్టె అని ఆమె మరచిపోయింది. తమ చుట్టూ తమ సంగతి మరచి చెవులు రిక్కించే మానవజాతి వుందని ఆమె మరచిపోయింది. తన ధోరణి తనదిగా వుంది. అంతవరకు నిందితుడై ఆమె వైపే తదేకంగా చూస్తూవుండిన మగధీరుని చూపులు అటు యిటూ మళ్లాయి. కొందరు ఆశ్చర్యంగా చూస్తున్నారు. సన్నగా కొందరు కళ్లతో మరికొందరు బిగ్గరగా పళ్లతో నవ్వుతున్నారు. అరికాలికింద రైలు చక్రాలమీది మంట ఆ మగరాయుడి నెత్తికెక్కింది.

'ఆ బ్రహ్మగాడికి బుద్ధిలేక రాస్తే రాశాడు గానీ, వాడికి బుద్ధిలేదని గ్రహించిన నీబుద్ధి మాత్రం చాల గొప్పది. నాతో యిలా వుండి నువ్వేడుస్తూ నన్నేడిపించడ మెందుకూ? నవ్వుతూ, నవ్విస్తూ ఎక్కడ హాయిగా వుంటావో అక్కడికే వెళ్లిపోరాదూ! ఒక్కనాటితో పీడ విరగడవుతుంది!'

'ఆఁ! అలాగా!!...అ పైన యెవతెనో దారిన పొయ్యే దానిని తెచ్చిపెట్టుకొని కులుకుదామనా?... ఛీ ఛీ! సిగ్గులేకపోతే సరి!...' అంటూ ఆమె చూపు మరల్చింది. అప్పటికది రైలుపెట్టెఅని గ్రహించి నట్లుంది. ముఖం క్షణక్షణానికి రంగులు మారింది. కండ్లు నిండుకొన్నాయి. అభిమానం చూపిన పెగ్గె అది!

'రండి! మీ చేతులతోనే గబ క్కున కింద తోసేయండి. పడిచస్తాను. మీ రన్నట్లు ఒక్క నాటితో పీడ విరగడై పోతుంది!'—

ఆమె అతని చేతినిబట్టి లాగుతూ వుంది. పెనగులాటలో పైట జారింది. తలలో వువ్వులు జారాయి. రైలు పెట్టెలో నవ్వులు చెలరేగాయి. ఏదీ గమనించని స్థితిలో ఆమె వెక్కివెక్కి యేడుస్తూ వుంది. ఇద్దరు పిల్లలు బిస్కట్ పొట్లాన్ని వదలి పెట్టి తల్లినిచుట్టు కొన్నారు. కసుగందుల యేడ్పులు ఈ కమ్మని దృశ్యానికి రంగులు పులుముతున్నాయి. 'చేయి వదులుతావా? లేదా?'—అంటూ చేయి పైకెత్తుతున్నాడు తాళిగట్టిన ధీరుడు.

'ఛీ ఛీ! మీకేమన్నా బుద్ధుందా లేదా? ఇన్నేండ్లు సంసారంచేసి యిద్దరు బిడ్డల్ని కనుక్కొని యింకా కుక్కల్లాగ కాట్లాడుతున్నారే!...తోడబుట్టుకు ఒక చీరతిసిస్తే నీ యబ్బ గంటేమి పొయ్యింది. మీ అన్న నీ కొక చీరతెస్తే మీ వదిన వాడినలా అడిగితే నువ్వేమంటావు?...పోనీ! ఆడది...అడిగితే ఆడిగింది... దాని బుద్దే అంత...దానికి చెయ్యి చేసుకుంటావే?... చాలుగాని కుచ్చోండి!'—ఓ పండు ముత్తయిదువ నిండు హృదయంలో యిద్దరినీ గదమాయించింది. నాలాంటి ఒకరిద్దరు ఆశ్చర్యంగా ఆమెవైపు చూస్తే

'ఏంవుందిలే నాయనా! ఆలూ మగల కొట్లాట ఆరిక కూడు వుడికేదాక!' అని సమాధానపరచింది. అంత తేలికగా ఆమె సమాధానపడ గలిగింది కానీ, నా సందేహం నాది. ఆ దృశ్యం నా కనులముందు మెదిలే సరికి – యిక జన్మలో వాళ్ల ఒకరి మొగ మొకరు చూచుకోలేరన్న సందేహం కలుగుతూ వుంది. వెంటనే చిట్టిబాబు సంసారం చిందులేస్తూ ముందు కన బడింది. మనసు గందరగోళంగా వుంది. రైలు పరు గిడుతూనే వుంది. నా మనసు శూన్యాన్ని చూస్తూ ఈ సమస్యా పూరణకు ప్రాకులాడుతూ వుంది.

ఎంత సేపు గడచిందో తెలియదు. బాగా ప్రొద్దుపోయినట్లుంది. రైలు ఓ స్టేషనులో ఆగింది. విద్యుత్కాంతులలో 'ప్లాట్‌ఫారం' వింత కాంతు లీనుతూ వుంది. ఇంతవరకు కీచులాడు కొంటున్న ఆలుమగలు ఆ స్టేషనులో దిగడానికి సామానులు సర్దుకొంటున్నారు, ఆదరాబాదరా. ప్లాట్ ఫారం బాగా రద్దీగా వుంది. బండీ ఆగీ ఆగకముందే ఎక్కేవాళ్లు, దిగేవాళ్లు తోచులాడుక చస్తున్నారు. ఆ తోచులాటలో కాలు, చేయి యేదో ఒకటి తప్పక పోగొట్టుకొంటారేమో అన్న భావన బయట నిలబడి చూస్తున్న వాళ్లకు కలుగుతూవుంది. ఎక్కేవాళ్ల దిగేవాళ్లకు, దిగేవాళ్లు ఎక్కేవాళ్లకు నిదానాన్ని గురించి పాఠాలు చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. చెబు తున్న పాఠాలను పెడచెవిని పెడుతున్న నేటి విద్యార్థిలా, ఆ తోచులాటలో యిరుక్కొన్నాడు యింతవరకు భార్యతో యుద్ధానికి తలపడిన మగధీరుడు. మనిషి గోగుదంటులా సన్నగా వుంటాడు. ఆ తోచులాటలో ఆయాస పడుతున్నాడు. ఆయాస పడుతూ అదో రకంగా దగ్గుతున్నాడు. దగ్గురూ దిగలేక నలిగి పోతున్నాడు. ఆ మానవుడి సతీమణి మధన పడిపోతూ వుంది. 'అబ్బబ్బ! యేం పాడుగుంపో? రీతీ రివాజు లేదు. వీళ్లకంటే గొఱెగుంపు మేలు!' అని వాపోతూ వుంది. 'నిదానంగా యెక్కిదిగితే 'మీ అబ్బగంటేం పోతుంది?' అని అందరిని మందలిస్తూ జాగ్రత్తగ దిగమని భర్తను హెచ్చరిస్తూ వుంది.

అతడు దిగాడు. ఆమె చెప్పినట్లు జాగ్రత్త గానే దిగాడు. ఆ పై యిద్దరు పిల్లలను దించు కొన్నాడు. ఆమె చేతిని పట్టుకొని మెల్లగా దిగమని హెచ్చరిస్తున్నాడు. ఎవరి తొందరలో వారుంటే— 'ఆడమనిషి దిగటం తెలియడంలేదూ?' అని అందరి పైన గుడ్లురుముతున్నాడు. ప్లాట్‌ఫారం కాస్త యెత్తున కట్టినవాళ్లని నిందిస్తున్నాడు. నా ఆశ్చర్యా నికి అవధులు లేవు. గంటకు పూర్వం, ఈ పెద్ద మనిషి, 'ఫో! ఎవడితో నీకిష్టమైతే వాడితో ఫో! పీడ విరగడవుతుంది!' అని పదిమంది ముందర పబ్లిక్‌గా చాటింపుచేసిన పెద్దమనిషి—పడుతున్న ఆవేద నకు అర్థం తెలియలేదు. రైలుపెట్టెలో స్వజాతి నవ్వులు గుసపోసుకొంటున్నాయి.

అంతలో యెవ్వరో ఓ పల్లెటూరి మొద్దబ్బాయి. ముద్దుగ వున్నాడు. 'అసలు సిసలైన తెలుగుజాతికి వారసుడిని నేను!—అన్న తీరుగా వున్నా యతని దుస్తులు. పండ్ల సందున టిక్కట్టు కరచి పట్టు కొన్నాడు, చేతిలో పాత సంచి ఒకటుంది. మరో చేత్తో వూడిపోతున్న గోచీని సర్దుకొంటున్నాడు. రైలు వెళ్ళిపోతుందేమో అన్న తపన వాడిది. ఏదీ గమనించే స్థితిలో లేడు. కండబట్టిన పొట్టేలులా పెట్టెలోనికి జొరబడ్డాడు. పల్లెటూరి మొద్దబ్బాయి చేయి ఆ హడావుడిలో దిగుతున్న సాధ్వికి తగిలింది. మగధీరుడు రెచ్చిపోయాడు.

'కండ్లు కనపడలా?...ఆడవాళ్లు దిగుతున్నా రన్న యింగితజ్ఞానం కూడా లేదు. ఛీఛీ! వట్టి ఫూల్స్!...'

'పొరపాటయిందయ్యా! ..రైలెళ్లిపోతిందేమోనీ తొందరపడితి! ఏఁవనుకోబోకండయ్యా!' తప్పు తెలుసుకొన్నాడు పల్లెటూరబ్బాయి. వాడి మాటల్లో తపన వుంది.

'రైలెక్కడిరా పొయ్యేది?... సుద్ద పల్లెటూరి గొఱ్ఱెలా మాట్లాడుతున్నావే?'

'నేను గొఱ్ఱెకాదయ్యో! మేకపోతు!...'

'ఆఁ!'

'మరేందయ్యా .నీ యిష్టమొచ్చినట్లు నోరు పారేసుకుంటుండావు. చేసినతప్పు ఒప్పుకుణ్ణోడు

గొట్టవతాడు. పొరపాటయిందని చెప్పినా తెల్సుకోలేని నువ్వు గొట్టె! నీ యబ్బ గొట్టె! నీ తాత గొట్టె!!'

రైలుపెట్టె విరుచుకుపడి నవ్వింది.

'ఎవరితోనో నవ్వుతూ నవ్విస్తూ హాయిగా వుందు! ఫో!!' అని గంటక్రితం ధారాళంగా పర్మిషన్ యిచ్చిన పెద్దమనిషి పొరపాటుగ పరపురుషుని చేయి తగలడాన్ని సహించలేకపోవడం నా మెదడులో మరిన్ని ఆలోచనల్ని పులిమింది. గార్డు చేతిలో పచ్చదీపము తలమీద మూరెడు పైకిలేచి. శోభాయమానంగా వెలుగుతున్న విద్యుద్దీపాలను 'చూడు నా దెబ్బ!' అని సవాలుచేసినట్లు అటు యిటు ఊగిసలాడేసరికి రైలు బయలుదేరింది.

కొన్ని ఆలోచనలను, అనుభూతులను వదలి పెట్టి మరికొన్ని కొత్త ఆలోచనలను, అనుభూతులను మోసికొని రైలు బయలుదేరింది.

విజయలక్ష్మి చిట్టిబాబుల సంసారం కనుల ముందు కదిలింది.

రైలుపెట్టెలో కీచులాట కిచకిచ నవ్వింది.

ఈ అనుభవం నా ఆలోచనలను ఓ అందమైన ముడివేయడానికి ఆతురతపడుతూ వుంది.

'రైలు ఒక సంసారము. రెండు రైలుపట్టాలు ఆలుమగలు. రైల్వే స్టేషన్లు ఆలుమగలమధ్య జగడాలు...రైలు గమ్యస్థానం చేరుతుంది. ఆలు మగలన బడే రెండు పట్టాలమీద సంసారమనబడే రైలు .. జగడాలనే స్టేషనలో ఆగుతూ ఆగుతూ గమ్యస్థానం చేరుతుంది!'

అనుభవం నేర్పిన పాఠం యిది! నాలో నేను నవ్వుకొన్నాను. నవ్వుతూ ఆ పండు ముత్తయిదువ వైపు చూశాను. ఆమెకూడా నవ్వుతూ వుంది. అది నవ్వుగాదు. ఆ తల్లి జీవితానుభవాల తోరణంలో అరివిరిసిన పువ్వు!' నాయనా! ఆలూ మగల కొటా ఎంత సేపు?...ఆరికకూడు ఉడికేదాక!' అన్నట్లుంవా నవ్వు!

రైలు పోతూనే వుంది!

---

# నా తత్త్వం

శ్రీ నూతలపాటి గంగాధరం

నాకు వెనక్కి నడవటం రాదు,
అప్పు డప్పుడూ తిరిగి చూడటం తప్ప!
ఎందుకంటే నా శరీర నిర్మాణం కూడా
ముందు నడకకే సిద్ధంగా ఉంది.

వెడుతూ వెడుతూ వెనక చప్పుడైనప్పుడు
తిరిగి చూస్తాను,
—దారి సరైనదా కాదా,
—దారి మార్చవలసిన అవసరం ఏర్పడిందా,
---నడుస్తున్న నా నడతలో
కొత్తదనం, గొప్పదనం ఉందా లేదా,
అని తెలుసుకోవడానికి!

నాదెప్పుడూ ముందు చూపే!
నా కళ్లు ముందే ఉన్నాయి కాబట్టి!
కొందరి కళ్లు వెనకే ఉంటాయి
అది ప్రకృతి విరుద్ధం కదా మరి—
అని ఏం చెప్పినా వాళ్ల చూపు
వెనక్కే వెడుతుంది

వెనక్కి నడవడం కూడా
పెద్ద ప్రతిభ అనుకునేవాళ్లున్నారు
గారడీవాడు కూడా నడుస్తుంటాడు—
వీధిలో అంగడి పెట్టినప్పుడు!
అదే బ్రతుక్కి పరమార్ధ మనుకుంటే ఎలా?

జరిగిపోయింది ఎంత ఘోరమైనా
ఒక కథలాగా నిశ్చింతగా వినడం,
జరగబోయేది ఎంత చిన్నదైనా
సంచలించి—సన్నద్ధమవడం—
ఇదీ నా తత్త్వం!

# సంశోధిత మహాభారతము - కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు

## కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావు

సంశోధిత మహాభారతమున కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములుగల ఈ సంపుటమొకటి. దీనికి 1. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము (2) ఆచార్య దివాకర్ల వేంకటావధాని (3) ఆచార్య బిరుదు రామరాజు (4) శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు అనువారు సంపాదకులు. ఇందు రెండుపోద్ఘాతము లున్నవి.

1. ఉపోద్ఘాతము : ఇందుపై నాల్గు పర్వముల కథా వృత్తాంతములున్నవి. దీనికి చివర స్త్రీ పర్వమునందలి వృత్తముల పట్టిక గలదు. కర్త : ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము.

2. ఉపోద్ఘాతము : తిక్కన సోమయాజి ఇతి వృత్త నిర్వహణము. రసపోషణము కర్త ఆచార్య దివాకర్ల వేంకటావధాని.

సాధారణముగా నిట్టి ఉత్తమ స్థాయిలో ముద్రితమైన గ్రంథములలో ముద్రణాది దోషముల కావస్కారమే లేదు. అయినను ప్రస్తుత సంశోధిత మహాభారతము మాత్రమట్టి దోషములను చూపుట కవకాశమిచ్చినది.1 ఈ సంపుటముననను నివి గలవు. తొలుత వానిని చూపి, ఆ వెనుక—గ్రంథప్ప విషయ ములను విమర్శించెదను.

### గ్రంథముద్రణ—అవ్యవస్థ

ఈ సంపుటమున ముద్రణము జాగరూకతతో జరుగకపోవుటవలన—పదలోపములు, అక్షర లోపములు, ముద్రణ స్థాలిత్యములు దొరలినవనియు, దానివలన—గణయతి ప్రాస భంగములు గలిగినవనియు సంపాదకులు గమనింప లేదు—మాదుదు—వాని వివరములు.

### పదలోపములు

స్త్రీ. 1—89.

క. డెందము తిర్యగ్యోనుల
కరుణా సమగ్రమై యుండు భవ
న్నందనుఁ డజాత శత్రున
కుందచ్చరితంబు నీవు కొంత యెఱుఁగవే

ఇందు ప్రాసభంగమగుటయేగాక రెండవ పాదమున గణము—లోపించినది.

క. డెందము తిర్యగ్యోనుల
యందున కరుణాసమగ్రమై యుండు భవ
న్నందనుఁ డజాతశత్రున... . అని. పూ. ము.2

సౌప్తి. 2—7. క. అఱచినఁ బఱచిన వ్రేతలు
గఱచిన నత డించుకయును గరుణింపక యం
దఱ నుఱుము సేసె గుంపుల
యుఱికి ఖడ్గదారుణోల్లసనములన్.

నాల్గవపాదమున—పదము లోపించినది—గణభంగము. యుఱికి యుఱికి ఖడ్గదారుణోల్లసనములన్ అని పూ. ము.

స్త్రీ.2—212. క. కురువంశమెడల వచ్చినఁ
బరమోపాయమున మగుడఁ బడసెన్ మడిసెన్
గురునికరము తోడన యి
ప్పురుషార్థసార భూషణుఁడు గదే.

నాల్గవ పాదమున గణభంగము—'పురుషుఁడు' అను పదము లోపించినది.

పురుషుడు పురుషార్థసార భూషణుఁడు గదే. పూ. ము.

---

1. సంశోధిత మహాభారతము—శాంతిపర్వము 6 సంపుటము—సమీక్ష — భారతి సెప్టెంబరు 1973. 34—43 పుటలు.

2. పూ. ము. పూర్వ ముద్రణము.

అ క్ష ర లో ప ము లు

శల్య.1-184.శా. ఆ రవ్యవిభుండు
ప్రాకారో
వాకల్ప
శ్రీకాంతుండు.

ప్రాసభంగము--ఆ కౌరవ్య—పూ. ము.

2—44. మ. ..................చె
చ్చెర రూపించినవేళ జెప్పె నెడకుం
జేరంగ వీతె తువో.

గణ భంగము—వీతెంతువో. పూ. ము.

సౌప్తి.1=120. చ ......................
జొరుఁడనిపంచె దీని దివిజుల్ గనిరి
కిట వేయు వేటికిన్.

గణభంగము. 'రింకిట'—అని పూ. ము.

2-156. సీ. గీ. తనయు లందఱు నీ కూర్మి
తమ్ముఁడును.

గణభంగము -'మ' లోపించినది.

స్త్రీ. 2-131. క.......................అ
ర్జునుఁ డిట్టి నీ చర్మం
బున కెట్టులు......

3 వ పాదమున గణభంగము---
నీచకర్మంబున—అని. పూ. ము.

అక్షర వ్యత్యాసములు

కర్ణ—3.210. శా. ఆ భీలత్వంబలరింసఁ
ద్రివ్వ జలదం బృధ్వీస్థలిన్

ఇచట 'జలదం' కాదు-'జదలన్' అని యుండ వలెను. చదలన్=ఆకాశమునందును, పృథ్వీస్థలిన్ భూమియందు అని యర్థము.

స్త్రీ. 1-125. శుద్ధ విరాటి వృత్తము—
ఒల్లం బోవుచు నుచ్చె నవ్విభుం—
'ఒల్లంబోవుచు నున్చె నవ్విభుం'

అని పూ. ము.

నున్చె—అనునది 'నునిచె' అనుట మప్ర యుక్తము. అల్లంగౌఁగిట నానృపాలకున్— అని తరువాతి పాదము కాబట్టి—ఉనిచె—కౌఁగిటనునిచె' అను అర్థము కుదురును.

ఈ క్రింది పద్య ముద్రణము సరిగా లేకపోవుటచే ప్రాస భంగమైనది.

శల్య. 2-326. భూరిశ్రవుఁ డొక్కనితో
బోరంగ నేయించి తట్లు పొడిచీకటి
రంహో రహితు సైంధవుని నట
బారి పఱచి తిట్టి నీకు పల్కులు
సనునే

ఇందు ప్రాసభంగముగుటయేగాక—రెండవ పాదమున గణభంగమైనది.

క. భూరిశ్రవుఁ డొక్కనితోఁ
బోరఁగ నేయించి తట్లు పొడి చీకటి రం
హోరహితు సైంధవుని నట

బారి పఱచి తిట్టి నీకు పల్కులు సనునే—అని ముద్రితము గావలెను.

ఇంకను గలవు. స్థాలీపులాక న్యాయమున కొన్ని మాత్రమే చూపితిని.

ముద్రణ స్ఖాలిత్యములు

ఇంకను గణయతిప్రాస విపర్యాసముల నొదవించిన ముద్రణ దోషములను గనుడు.

క ర్ణ ప ర్వ ము

1-116. ఉ. విస్తార మనోజ్ఞహార లసితంబగు
నా ఘనబాహు వకముల్ (గణము)

2-16. మ. తరుచెం డాడెద నుగ్రతం దలలు
నా దోర్దర్పముం జూడుమీ (యతి)

26. ఉ. ముందటి... ..........సం
క్రందన సూతి మాఱ్కొని
తిరఁబయి పోరెదఁ దాఁపఁ
బాణముల్ (గణము)
.........................దా
నం దుదిఁ జొచ్చినన్ జను
మొన న్నరుఁ దాఁకురిత్తవోవునే
(గణము)

163. క. వానపయింగురియ నతండు
వారించి గళ
దానాంబులలో...........(గణము)

280. క. .........................క
వ్వడి యర్థచంద్రశరముల (గణము)

శ ల్య ప ర్వ ము

1–265. చ. నిరతనివర్తిత త్రిభువన
మహనీయుని దైత్యమర్దిన (గణము)

2–226. గీ. ధర్మ పుత్రాదులును
సుయోధనుండు నతని (గణము)

339. గీ. గవి యున్నప్పుడు మము
నీవు గావకున్న (గణము)

స్త్రీ ప ర్వ ము

1–12. సీ. గీ. నాకతంబునఁ బొలిసిరి
నందనులును జెలులు (గణము)

21. మత్తకోకిల. తానచుటు దగిల్చి
యగ్ని యుదగ్రతం దరిగొన్న (గణము)

36. గీ. గలిగి శిశువయి
మారుగతి యెలర్ప (గణము)

94. క. నెరియక యుండంగ
శోకమేఁ దొరగెదనని (గణము)

121. సీ. పా. డని పల్కుదురు
కొంద అప్సర్థుఁ జేరి (గణము)

146. గీ. కీడ్చి వలువ లొలుచుటయు
నెఱిగి సుతుల (గణము)

2-6. లయగ్రాహి
యూరబహులాంశుచయ
చాతర రేఖలగు (గణము)

సౌ ప్తి క ప ర్వ ము

2–53. సీ.2 పా. మాన్య రథంబుల
శైబ్య సుగ్రీవంబులను (యతి)

తిక్కన ప్రాసలు—ఖండాఖండ ప్రాస

తిక్కన ఖండా ఖండప్రాస వాడలేదని—ఎసగు శబ్ద సందర్భమున నా శాంతిపర్వ సమీక్షలో నిరూపించితిని[3]. ఇందు అరసున్నలతో ప్రాసస్థానమున ప్రాసలు గలవు. గాని అవి నిర్బిందుకములు.

క. తోడనె హయ సూతులమెయిఁ
గాఁడఁగ నేయుటయు...వివే
క్రీడయ పోలెంగొని మే
న్గాఁడఁగ నిగిడించె ద్రిదశనారాచంబుల్.
(కర్ణ. 2—201)

వీనికి—నోనాడగ, మెయినాడగ—అని పాఠాంతరములు గలవు. కావున నరసున్నగల గాఁడఁగ అన్న పాఠము సరికాదు.

క. కేతన కపి భయదంబై
తోఁతేరఁగఁ జక్రధర...
ద్యోదితవల్గన బారు—
శ్వేతహరులు మెఱయవచ్చు వీరునిగంటే.
(కర్ణ. 3—174)

'తోఁతేరు'లో అరసున్న లేదని యీావఱకే ప్రయోగములను చూపితిని[3]

వ ప ప్రా స

క. కవదొనలును గాండీవము
నవల నిడంబనుపు ముందర రదము డిగు మే
న విదప డిగియెద శుభకర
మవున వ్విధమట్లు సేయమనుడు నచుఁడున్.
(శల్య. 2—333)

పుట యడుగున పాఠము లుదాహరింపబడినవి.

'ను విదప— స. ప. వల్రప్రాస విషయమున చర్చ కలదు'—ఇపట 'వల్రప్రాస' చర్చయేమి ?— 'వ'కు 'ల'కు ప్రాసయుండునా? వప్రాస యనుటకు, వల్రప్రాస అని ముద్రణము జరిగినది — అసలు, వ, ప ప్రాసయుండునా?— 'ప్రాసస్సర్వేషు చైక ఏవస్యాత్' అని సూత్రము-ఓష్ఠ్యవర్ణమగు 'ప'కును, అంతస్థమగు— 'వ'కును ప్రాసయెట్లు కుదురును—వ, ప ప్రాసలేదని సిద్ధాంతము. 'వీను విదప' ఈ పద్య ప్రాసనుగూర్చి, ఇప్పటికి డెబ్బదితొమ్మిది యేండ్ల క్రింద— క్రీ. శ. 1895 లో— అముద్రిత గ్రంధ

3. భారతి సెప్టెంబరు 1973. 'ఎసగు' శబ్దము సార్థబిందుకము కాదని అది నిర్బిందుకమని వ్రాయగా— శ్రీ రావూరి దొరసామిశర్మగారు డిసెంబరు 1973 భారతిలో ఎసగు సార్ధబిందుకమని — ఒక వ్యాసము వ్రాసినారు. ఎసగు శబ్దము నిర్బిందుకమే యని సోపపత్తికముగా చూపుచు, ఆ వ్యాసమునకు ప్రత్యుత్తరముగా నొక వ్యాసమును వ్రాయుచున్నాను.
పైకీ శాంతిపర్వ సమీక్ష—

చింతామణి పత్రికయందు చర్చింపబడినది— తిక్కన యతి పాసలనుగూర్చి పరిశీలన ఆవశ్యకముగా చేయదగి యున్నది.

పాఠభేద విమర్శనము

1 కర్ణ—1—3. క. బల విక్రమములు వినుతం
బులు.........పాండుపుత్రానీకం
బులు 4రెండునాళ్ల వోరుట

పుట యడుగున—3—1 రెన్నాళ్లను (లు) ఉ. ఏ. ఐ—ఘు, జ, ట, డ, త, ద, ల, వ.

పదునొకొండు ప్రతులలో 'రెన్నాళ్ల' అను పాఠముండగా—దానిని విడిచి—'రెండు నాళ్ల'—అను పాఠము నిలుపుట సరికాదు—రెన్నాళ్ల కేవలము వ్యావహారికమని కవిప్రయోగము లేదని విడిచియుందురు. కాని కవి ప్రయోగము దీనికి గలదు.

'క. పది దినము లైదు ప్రొద్దులు
పదపడి రెన్నాళ్ల నొక్క పవలున్ రేయున్
ముదమున రణ మొనరించిరి
నది సుతగురుకర్ణశల్య నాగపురీశులు'

వ్రాత ప్రతి—అథర్వణ భారతము—(సంశోధిత మహాభారతము—ఆదిపర్వము—పుట 28 అథోజ్ఞాపిక.)

రెన్నాళ్లకే గాదు—'రెన్నెల్లు'కు కూడ కవిప్రయోగము గలదు.

క. రెన్నెల్లలోన నాకుం
జెన్నుందగఁ జెప్పు...భా. రా. సం. 204.[1]

II 1—116. ఉ. ధీరజనోత్తముండు సహదేవుండు4
మైగరి దుస్ససేనుఁడున్

పుట యడుగున—1. మైగరి—కొన్నిప్రతులు—మైగరి శూరుఁడు.

సూ - చూడు—కర్ణ 2—186.

కాని కర్ణ 2—186—మేగరి యని యతి స్థానమందున్నది.

'క. ఆ టోప మడఁగి యచ్చటి
మేటిమగలు తిచ్చవడిరి మేగరి కర్ణుం
డేటలవికిఁ గవిసె—'

ఈ సంశోధిత ముద్రణమున—(పుట 99)—నీ పద్యమున

'మేటిమగలు తిచ్చవడిరి మెయిగరి' అని పాఠ మీయబడినది—పుట యడుగున—

2. మేగరి, మైగరి అనియు పాఠములు—అని కలదు—కాని యిచ్చట—పాఠము — 'మేగరి' అనియే యుండవలెను.

మెయిగరి— అను పాఠమెక్కడిదో తెలుపబడలేదు— ఈ పాఠము - శ.ర.లో నున్నది— కాని, 'మెయిగరి' పాఠము సరికాదని సూ—ని. 'మేగరి' గ్రహించినది—అసలు 'మెయిగరి' అను పదమే అందు లేదు— (చూ. 6 వ సంపుటము. 552 పుట). 'మెయిగరి' అన్నది కరాలపాటి ప్రతి—ష—లో గలదు— అదియు చూపబడలేదు— ఆనందముద్రణము—థ—లో మేగరి అని గలదు— అదియు చూపబడలేదు— మేగరి అని భా.ల వ్యాఖ్య— (భా.కూ) ఇదియు పేర్కొనబడలేదు-- కర్ణ. 1—116 లోను. 2—186 లోను—'మేగరి' అనియే పాఠముండవలెను—

III 1—273.సీ.పా. ఇమ్ముమ్వురుకు దారుణాక్రమణ
మున భువ
నత్రయ3 సంబంధనం బొనర్చు—
చున్నారు...

పుట యడుగున— '3. నత్రయంబను బాధ నలుచుచున్న— కొన్ని ప్రతులు— (అఖండవడి చూడవలెను)'— అని కలదు.

ఇచట— 'నలచు' అను ధాతువు— అలచు—అని అజాదిగా భావించి, సంపాదకు - లఖండయతి యని వ్రాసి యుందురు.

నత్రయంబును బాధ నలచుచున్న— అఖండ యతి యగును.

కాని—'నలచు' హలాదిగా యతి స్థానమునగలదు.

మ. గెలిచెన్ బార్వ నరేంద్రులన్
బలిపె నాగ్నేయావనీ నాదులన్
నలఁచెన్ దక్షిణరాజ
పంక్తిఁ జెలిచెన్ నైరృత్యరాట్కోటి,
ఉ. హరి. 5—16

4. ఇట్టి ప్రయోగము లన్నింటిని నా శబ్ద రత్నాకర సంస్కరణ ముద్రణమున నిచ్చియున్నాను— అది ముద్రితము గావలసియున్నది.

IV. 2-6. గీ. బాడుదలఁబట్టి...పాండుతనయ
2ముఖ్యవీరు వారననేల మునుము
వట్టి.

పుటయడుగున— 2. ముఖ్యుఁ డెదిరించినను మొగమాటలేక —

(ఇచ్చట అఖండయతిగా చూచుకొనవలెను— అని కలదు.)

మొగమోట—అను శబ్దమున కుభయవళ్లు గలవు.

స్వరయతికి—

నీయున్నతికంటె నాకు మొగమోడి సహించిరిగాక
కు. సం. 2—163.

హల్లుయతికి. క. .........................
జూడఁ గనడవఁగఁదగు మొగ
మోడంగారాదు మాకు మొగి
నెవ్వరికిన్.
హరిశ్చ. 5—94.

కావున— మొగమోట శబ్దములో— హల్లునకు యతి యున్నది— అఖండయతి కాదు.

V శ్రమము—శ్రవము—

కర్ణ=2–90.సీ.పా. 'శ్రమమునకై యేను సకలాంబ
కములనె
క్కుడు వెసనేయ నయ్యెడను నొక్క'

79. పుట యడుగున-1 శ్రవమునకై యేను...
వివిధాంబకంబు లెక్కిడి—
పెక్కు తాళపత్ర ప్రతులు.

వీరుండనై నేను వివిధాంబకంబు—ఎ. గ.

'శ్రవము' అను శబ్దము తాళపత్ర ప్రతులలో నిర్ధారకముగానున్నను, పాఠము 'శ్రమము' అని గ్రహించుట సరికాదు-సంపాదకు లీ 'శ్రవము' తప్పనుకొని, శ్రమము అను పాఠమును నిలిపిరి. వారు పరిశ్రమ చేయలేదుగాని—'శ్రవము' అను శబ్దము, తాళపత్ర ప్రతులలో, పై యొక్కచోటనేగాక, ఈ సంపుట మున—నింకను వేఱొక చోట గలదు—చూడుడు.

కర్ణ–2–30–సీ.పా. పొలుపును గలుగు కాంభోజ
హయంబుల
వలసినఁ బేర్చు సత్త్వంబులందు

69. పుట యడుగున 2. పెక్కు శ్రవంబులందు—
న. బ. వ. స.
పెక్కు జవంబులందు—
పెక్కు ప్రతులు.

ఈ శబ్ద సందర్భమున పై రెండు పట్టు లను, ఆనంద ముద్రణ పాఠములు సూచితము కాలేదు—ఆ ముద్రణమున

కర —2—30. పెక్కు శ్రవంబులందు—క. చ. జ.
2—90. శ్రవమునకై యేను వివిధాంబ
కంబుల—క, గ, జ.

అను పాఠభేదములు సూచితములైనవి.

కర్ణ పర్వముననే గాక, శల్య పర్వమునను— 'శ్రవము' అను పదము—తాళపత్ర ప్రతులలో గలదు.

1) శల్య–2–269.చ............కౌశలంబు పెం
పున నధికుండు తత్పరతఁ
బూని శ్రమం బధికంబు
సేయఁటన్.

పుట 401. పై పద్యమున పాఠ భేదమే లేదు—కాని—

ఆనంద ముద్రణమున—శ్రవం బధికంబు
జేయుచున్—క. గ. జ—

అని పాఠభేద మీయబడి యున్నది — (ఆనంద ముద్రణము.)

2) 2–71. వ. భీము జయించుటకై గదా పరి
శ్రమం బాచరించె.
పుట. 402. పంక్తి. 9.

ఇచటను ఏ పాఠభేదము చూపబడలేదు—కాని ఆనందముద్రణమున— 'పరిశ్రవం బాచరించె' అను పాఠభేదము చూపబడినది—

సంపాదకులానందముద్రణమునకు 'ఛ' అను సాంకేతికమునిచ్చిరి— కాని యీ సంపుటమునం దేకారణముచేతనో, ఆ ముద్రణ ప్రతి పాఠములు చూపలేదు—

పై తాళపత్ర ప్రతులలో ప్రాయస్థానమున నిర్ధారకముగ నుండుటయేగాక— అన్నిచోట్లను, 'శ్రవము' అను పాఠముండుటచేత— నదియే సరియైన పాఠమని గ్రహింపనగును.

శ్రమము అను శబ్దమునకు 'శ్రవము' అనునది రూపాంతరము — తిక్కనయు 'శ్రవము' శబ్దమునే వాడినాడని మనము నిశ్చయింపవచ్చును — తిక్కనకు ముందే, పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణమున — నీ శబ్దము నిర్ధారకముగా వాడియున్నాడు.

వస్సి యెంతయును శ్రవంపడి యిట్లు—5 ఆ. 190 పంక్తి.

తిక్కన వాడుకనుబట్టి విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో నీ శబ్దమును ప్రయోగించినాడు.

చ. వసుమతి నెల్లవారలు
శ్రవం పడకుండిన—
తృతీయోల్లాసము—44 ప.

అతడే తన గ్రంథమున— నవమోల్లాసము 10 వ పద్యమున.

'క్రవమున తత్సమమును ద
ద్భవమును'

అని క్రమశబ్దమునకు 'క్రవము' అని ప్రాసలో ప్రయోగింపగా, ఆ రూపము వ్రాతప్రతిలో నుండగా ముద్రితమైన ప్రతిలో 'భువిలో' అను పాఠ మగపడుచున్నది.[6] ఈ శ్రమ శ్రవ- శబ్దములను గూర్చి ఒకావలకే విపులముగా చర్చించుటచే నిపుడు విరమించితిని.[7]

VI. సౌదామని—సౌదామిని—

కర్ణ–2–188.సీ. భేదింప రత్న ప్రభాదీప్తమగునది
  శిసౌదామనీచారు జలదమంబు

పుట యడుగున—దామినీ కొన్ని ప్రతులు— అని కలదు.

సౌదామనీ శబ్దమే సరియైనదనియు, సౌదామిని సరికాదనియు నభిప్రాయముచే వ్రాతప్రతులలో సౌదామినీ శబ్దమును విడిచినారు—కాని 'సౌదామిని' సరియగు రూపమే.

కొలని గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో నీ సౌదామినీ రూపము నిర్ధారకముగా వాడియున్నాడు.

క. అని చక్రము చేవెలుగంగ
వినతాసుతు నెక్కివచ్చి విభుఁడొప్పె సువ
ర్ణ నగంబు మీఁద సౌదా
మనితోఁ జెలువొందునట్టి మేఘము పోలెన్[8]
(2—146.).

మంకణ మహాముని మహాత్మ్యాభి వర్ణనము

VII. శల్య. 2—160.

సి. అతఁడు సరస్వతి నవగాహనము సేయు
చుండియా చేరువనోర్తు తడుపు
గట్టక నీళ్లాడఁగాఁ జూడ దనదు శు
క్లము నిర్గమించిన ఘట సురక్షి
తము సేయ సప్త భేదము లందియది సత్పు
రుషు లైరి వారు మరుద్గణంబు
నకు సంజన నకారణం బైరి.

పుట యడుగున—160. 5. సప్త బుషు లైరి—పెక్కు ప్రతులు సప్త మునులైరి—చ. ఈ పాఠమున యతి భంగమైనది—అని కలదు. సప్త మునులైరి అనుచో యతి భంగమగుట వాస్తవమే

---

5. భాషాశాస్త్రమున— ఉచ్చారణలో — మ–వ గా మాఱుట కుదాహరణములు గలవు— మామయ్య—మావయ్య— ఏమిటి– ఏవిటి– ఏమండీ— ఏవండీ— కీ. శే. గురజాడ అప్పారావు దీనిని తొలుత గుర్తించి, తన కన్యాశుల్కము నాటకమున — 'మ'కారము— 'వ'కారముగా, మాఱిన శబ్దములలో నర్ధానుస్వారచిహ్న ముంచియున్నాడు— కన్యాశుల్కమున భాషాశాస్త్ర సంప్రదాయములనుగూర్చి చూడుడు. నా వ్యాసమునందలి భాష—గురజాడ శతజయంతి సంచిక.

6. కావ్యాలంకార చూడామణి—వేదము వేంకటరాయశాస్త్రిగారి ముద్రణము.

7. భాషాశాస్త్ర పరిశోధన — యతిప్రాస తత్త్వము — Annals of Oriental Institute Madras University Vol 15. 1958—59.

8. చూడుడు శబ్దరత్నాకరాను బంధము. శబ్దరత్నాకరము 1959, పుట 866.

గాని యచట సప్తముని శబ్దముండుట మాత్రము గమనింప దగినది.

ఋ—రు - యతి

తిక్కన ఒకా సీసపాదమున పై యతి నుప యోగించినాడు.

"తము సేయ సప్త భేదములంది యది సప్త
ఋషులకైరి వారు మరుద్గణంబు'

తాళపత్ర ప్రతులలో లేఖకులు సప్త ఋషులు అని సరిగానే వ్రాయగా, ఈ ఋ—రు యతి అప్ప కవీయమున జెప్పనందున ముద్రణ కాలమున పరిష్కర్తలు—

సప్తఋషులను సత్పురుషులుగా మార్చిరి.

కాని 'సత్పురుషులు' అన్నది శుద్ధముగా అపపాఠము. సప్తఋషులు అనునదే సరియైన పాఠము—మూలానుగుణము.

మంకణ మహాముని మాహాత్మ్యభివర్ణనమ్

'సప్త సారస్వతం చైవ
తీర్థం పుణ్యం తథాస్మృతమ్
శ్రుణు మంకణ కస్యాపి
కౌమార బ్రహ్మచారిణః
అపగా మవగాఢస్య
రాజనే ప్రకీడితం మహత్
దృష్ట్వాయ దృచ్ఛయా తత్ర
స్త్రియ మంభసి భారత
స్నాయం తీం రుచిరాపాంగీం
దిగ్వా ససమనింది తామ్
సరస్వత్యా మహారాజ చ
స్కందే వీర్యమంభసి
తద్రేతస్సతు జగ్రాహ
కలశేవై మహాతపః
సప్తధా ప్రవిభాగంతు
కలశస్థంజగా మహ
తత్రర్షయస్సప్త జాతా
జజ్ఞిరే మరుతాంగణాః'

సంస్కృత భారతము శల్యపర్వము 39 అ. 32–35 శ్లో.

వావిళ్ల ముద్రణము పుట 1239.

మూలమున 'సప్తర్షయ'. అని యున్నది. గాన పాఠము సప్తఋషులు. తిక్కన—ఋ—రు—యతి నుపయోగించినాడు.[9]

పాఠములు—మూలాతిక్రమణము

1) 1–282. వారిధి—మందరము.

సీ. సామర్థ్యమొప్ప విశ్వంభరాచక్రంబు
రథముగాఁజేసి చంద్రముని నుష్ణ
కరునిఁ జక్రంబులుగాఁబెట్టి 1వారిధి
నక్షమొనర్చి.........

పుట యడుగున— 1. యిరుసుగా నద్దినొనర్చి— ఊ—ఏ— మందర పర్వతము అక్షముగా జేయబడినదని మూలము.

'మందరః పర్వతశ్చాక్షో జంఘాతస్య మహానదీ 8–34–20' చిత్రశాలాప్రతి—అని కలదు—

శివుడు త్రిపురాసురసంహారము చేసినపుడు — భూమిరథముగాను, సూర్యచంద్రులు రథచక్రములుగాను— మందరపర్వతము అక్షము— అనగా ఇరుసుగా చేసెనని సంస్కృత భారతమూలము — కాని తిక్కన యిట—పర్వతమును తీసివేసి వారిధి — సముద్రమును, యిరుసుగా చేసినాడు— ఇది శైవసంప్రదాయము — కావుననే 'యిరుసుగా నద్దినొనర్చి' అను పాఠము గలదు.

శివుడు త్రిపురాసుర సంహారమును, విలక్షణములైన సాధనములతో లక్ష్యమును సాధించెను. ఇచట మందర పర్వతము స్థిరమైనది. దానితో యిరుసు చేయుట సులభము—కాని సముద్రముతో—(అదియును

9. ఈ విషయమును తొలుత నేను వావిళ్లవారి అప్పకవీయము పంచమ ముద్రణము (1951) లో దెలిపినాము. ఈ సందర్భమున—భారతము లక్ష్మీపతి శకటరేఫ నిర్ణయము — బ్రౌను దొరవారి భారత పాఠములు—పరిశీలింప దగినవి.'

విఱిగిపడు నలలు గలది) యిరుసు చేయుట దుస్సాధ్యము—శివుడటు చేసినాడు—చూడుడు.

సీ. ఖండఖండములుగ గఁ బెసిన తేరిపై
భంగంపు టిరుసు పొసంగఁ గూర్చి
విజ్జోడు పడి నిచ్చ వియదీథిఁ దిరిగెడు
చక్రంబు లొనఁగూడ సంఘటించి
తలకొన్న భీతి కొండలపడ బహుముఖ
భ్రాంత సారథి నేరు పరిగ నిలిపి
పలుక పదక్రమంబుల నలుజాడలు
వోయెడు గుజ్జము లే పూనుకొలిపి

గీ. కుంటివింటను బలువంకకోలఁ దొడిఁగి
విషమ లక్ష్యంబులేగతి వేసితయ్య
నేల్పు లెవ్వరు నీసాటి విజయనాటి
మల్లికార్జునలింగ ! ఉమాప్రసంగ

బొడ్డపాటి పేరయ మల్లికార్జునలింగశతకము.

చ. అనలుఁడు భాస్కరుండును
సుధాంశుఁడు నధ్వర సంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యీ క్రతువు
విష్ణుమయంబిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడున్ సమర
రూపమునందగ నీ ప్రబంధమిం
పొనరఁ బఠించినన్ వినిన నొందు
నరున్ జిర సౌఖ్యసంపదల్.

(3—397.)

పుట యడుగున పాఠ భేదములలో—'**అనిలుడు**'—ఉ. ణ. త. వ — అని కలదు – పై పద్యమున — 'అనలుడు' అనియే ముద్రితమైనది. మూలశ్లోకమిది—దీనికి పాఠభేదము కలదు. కాని రెండింటియందు '**అనిలుడు**' అనియే కలదు.

1) మఖోహి విష్ణుర్భగవాన్ సనాతనః,
వదంతి తచ్చాఖ్యనిలేందు భానవః.

2) మఖోహి విష్ణుర్భగవాన్ సనాతనో
వహంతి యంచాప్యనిలేందు భానవః.

ఈ పాఠమును గూర్చిన చర్చ లేదు.

తిక్కన యజ్ఞముచేసి సోమయాజియైన కతన యజ్ఞమున అగ్నిహోత్రునికి గల ప్రాధాన్యతను పురస్కరించుకొని, మూలము ననుసరింపక—'అనలుడు' అను పదమును వాడినాడు—అని గ్రహింపవలెను.

### పర్వ వివరణము

ఈ సంపుటమునగల ఉపోద్ఘాతములు రెండింటిలోను ఇందున్న పర్వములను గూర్చిన వివరణమే లేదు. ఒకే సంపుటమున నాలుగు పర్వములున్నప్పుడు వాని వివరణ ఆవశ్యకము.

### కర్ణపర్వము

మహాభారతమున కర్ణపర్వము ఎనిమిదవ పర్వము.

క. అనుపమ బలులగు కర్ణా
ర్జున వీరుల శౌర్య మహిమ శోభిల్లంగా
నెనిమిది యగు పర్వంబిది
యన బరగుం గర్ణపర్వమతి హృద్యంబై—

(ఆది 1—50)

నన్నయ సంస్కృత మూలమున 'నాలుగువేలు దొమ్మనూటఱు శ్లోకంబులు గలిగి' అని చెప్పియుండుటచే నిందు 49.0 శ్లోకములున్నవి. తిక్కన ఈ పర్వమును మూడాశ్వాసములుగా వ్రాసియున్నాడు.

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసము | 322 | గద్య పద్యములు |
| ద్వితీయా ,, | 401 | ,, |
| తృతీయా ,, | 401 | ,, |
| | 1124 | |

ఇందువలన తిక్కన మూలమున నాల్గవవంతు మాత్రమే రచించినాడని మనము గ్రహింపవచ్చును. ఇట్టి సంఖ్యా మూలమున గానవచ్చుచున్ననూ తెలుగున కర్ణ పర్వముతో మూలమునగల కథలన్నియు గానవచ్చుచున్నవి. మఱియు రసపోషణమున నీ పర్వము యుద్ధ పంచకమున తృతీయమైనను అద్వితీయమై యున్నది. (సశేషం)

# వెనుకబడ్డ ప్రాంతాల అభివృద్ధి

## డా|| ఎమ్. ఎల్. కాంతారావు

ఆంధ్రప్రదేశ్‌లోని వెనకబడ్డ ప్రాంతాలను అభివృద్ధి పరచాలని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంకల్పించి ఉన్నాయి. ఈ ప్రాంతాల ఆర్థిక అభివృద్ధికి కేంద్రప్రభుత్వం, రాబోయే 5 సంవత్సరాల్లో 90 కోట్ల రూపాయలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నట్టు తెలుస్తున్నది. ఈ డబ్బును తెలంగాణా, రాయలసీమ, కోస్తా ప్రాంతాలలో 5:3:2 నిష్పత్తిలో ఖర్చుపెడతారనికూడ తెలుస్తున్నది. ఈ సందర్భంలో మనం ఏ ఏ జిల్లాలు వెనకబడి ఉన్నాయో తెలుసుకోవటం అత్యవసరం. ఎందుకంటే ప్రస్తుత పరిస్థితుల్లో, అభివృద్ధి కార్యక్రమాలకు, జిల్లా చాలా అనువైన యూనిట్‌గా కనిపిస్తుంది. తాలూకా లేదా బ్లాకు ఇంకా అభిలషణీయమైన యూనిట్. అయినప్పటికి తాలూకా స్థాయిలో వివిధ రంగాలకు సంబంధించిన గణాంక వివరాలను సేకరించడం కష్టం. అంతేకాక షట్సూత్ర ప్రణాళిక ననుసరించి జిల్లా ఒక ప్రముఖమైన యూనిట్‌గా పరిగణన పొందింది. ప్రాంతీయ అభిమాన, దురభిమానాలు కొంతవరకు తగ్గాలన్నాకూడా జిల్లాను ప్రాతిపదికగా తీసికోవటం వాంఛనీయంగా కనిపిస్తుంది.

అభివృద్ధినిగాని, వెనుకబడినతనాన్నిగాని కొన్ని లక్షణాలద్వారానో, సూచికలద్వారానో తెలుసుకోవాలే గాని మరో రకంగా తెలుసుకోవటం కష్టం. తలసరి ఆదాయం, అభివృద్ధి సూచికల్లో ముఖ్యమైన సూచిక. కాని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇటీవల జిల్లాల వారీగా తలసరి ఆదాయం లెఖలను ప్రచురించలేదు. కాబట్టి వివిధ రంగాల్లో అంటే వ్యవసాయరంగం, పరిశ్రమలరంగం, విద్యుత్ రంగం, సాంఘిక సేవలరంగం, బాంకింగ్‌రంగం, జనాభారంగం మొదలైన వాటిల్లో ఒక్కొక్క జిలా సాధించిన అభివృద్ధిని తెలుసుకొంటే, దాన్ని బట్టి, తులనాత్మకంగా. జిల్లాల అభివృద్ధిని తెలుసుకోవచ్చు. అంటే ఈ పద్ధతి ప్రకారం జిల్లాలన్నిటిని అవి సాధించిన అభివృద్ధిని బట్టి వరసక్రమంలో పేర్కొనవచ్చు. అప్పుడు రాష్ట్రంలో ఏ జిల్లాలు అభివృద్ధి చెందాయో, ఏవి వెనకబడి ఉన్నాయో తెలుసుకోవడం సులభం అవుతుంది. కాని ఇక్కడ అభివృద్ధి అన్నది కేవలం సాపేక్షమైందే. అంటే అభివృద్ధి చెందిన జిల్లాలు అనేవి, రాష్ట్రంలోని ఇతర జిల్లాలతో పోల్చినప్పుడు వాటికంటే మెరుగైనవనేగాని, సర్వతోముఖాభివృద్ధి పొంది, సమస్త సంపదలతో తులతూగుతున్న జిల్లాలని మాత్రంకాదు.

రాష్ట్రంలోని ఏ జిల్లాలు అభివృద్ధి చెందాయో, ఏవి వెనుకబడ్డాయో గుర్తించడానికి ప్రస్తుతం ఇక్కడ అవలంబించిన పద్ధతిని వివరించడం అవసరం. ఒక జిల్లా వ్యావసాయకంగా, అభివృద్ధి చెందిందా లేదా అని తెలుసుకోవడానికి కొన్ని సూచికలు ఉపయోగకరంగా ఉంటాయి. ఉదాహరణకు పంటపొలాల్లో ఎక్కువశాతం భూమికి, నీటిపారుదల సౌకర్యాలు ఉంటే ఆ ప్రాంతం అభివృద్ధి చెందినట్టు పరిగణిస్తాం. అదేవిధంగా జిల్లాలో ఒక్కో వ్యవసాయదారుడికి ఉన్న సగటు పంటపొలం విస్తీర్ణం, ఇతర ప్రాంతాల్లోకంటె, హెచ్చుగా ఉంటే, అది అభివృద్ధికి మరో సూచిక. జిల్లాలోని సాలుసరిసగటు వర పాతం మరియొక సూచిక. జిల్లా జనాభాలో ఎక్కువశాతం వ్యవసాయంమీద ఆధారపడిఉంటే, అది ఆర్థికంగా వెనకబడినతనానికి ఒక గుర్తు. సాగుబడికి ఉపయోగకరమయిన పొలాన్ని

సాగులోకి తీసకరాకుండా ఉండడం వెనకబడ్డతనానికి మరో గుర్తు. వ్యవసాయంద్వారా గ్రామీణులకు ఒక్కొక్కజిల్లాలో లభించే సాలు సరిసగటు ఆదాయం అభివృద్ధికి వేరొక గుర్తు. ఇదేవిధంగా పారిశ్రామికాభివృద్ధిని సూచించేదానికి మరికొన్ని సూచికలున్నాయి. జిల్లా జనాభాలో, కర్మాగారాల్లో (Factories) పని చేసేవాళ్ళ శాతం ఎక్కువగాఉంటే అది పారిశ్రామికంగా లభివృద్ధి చెందినట్లు లెక్కించవచ్చు. పరిశ్రమలకోసం ఉపయోగించే తలసరి విద్యుత్ వినియోగం హెచ్చుగాఉంటె అది పారిశ్రామికాభివృద్ధికి మరో గుర్తు. ఈ విధంగా ప్రతిరంగంలోను అభివృద్ధిని తెలియచేసే కొన్ని సూచికలు ఉన్నాయి. కాబట్టి రాష్ట్రంలోని జిల్లాలసాపేక్ష ఆర్థికాభివృద్ధి తెలుసుకొనే ఉద్దేశ్యంతో, ప్రపథమంగా, ఒక్కొక్క రంగంలోని లభివృద్ధిని స్పష్టంగా, నిస్సందేహంగా సూచించే కొన్ని సూచికలను ఎన్నుకోవడం జరిగింది. సూచికలను ఎన్నుకొనేటప్పుడు, వాటికి సంబంధించిన గణాంక వివరాలు (Statistical data) సులభంగా దొరుకుతాయా లేదా అనేది మనసులో ఉంచుకోవడం జరిగింది. గణాంక వివరాలు లభించని పక్షంలో ఎంత మంచి సూచికైనా, దాన్ని వదలివేయవలసి వస్తుంది. ఒక సూచికను ఎన్నుకొన్నతర్వాత దాన్ని ప్రాతిపదికగా తీసుకొని 21 జిల్లాల్లో అత్యల్ప అభివృద్ధి గల జిల్లాకు ఒకమార్కు, దానికంటె మెరుగయినజిల్లాకు అంటే 20 వ స్థానం పొందిన జిల్లాకు 2 మార్కులు, 19 వ స్థానంపొందిన జిల్లాకు 3 మార్కులు ప్రకారం అన్ని జిల్లాలకు మార్కులు ఇవ్వబడ్డాయి. అంటే 21 జిల్లాల్లో సాపేక్షంగా అత్యధిక అభివృద్ధిపొందిన జిల్లాకు 21 మార్కులు వస్తాయి. ఈ విధంగా సూచికల ప్రాతిపదికపైన ఒక్కొక్క జిల్లాకు లభించిన మార్కులన్నిట్నీకూడి, వాటిని ఇతర జిల్లాలకు వచ్చిన మొత్తం మార్కులతో పోలిస్తే, ఒక్కో రంగంతో వివిధ జిల్లాల స్థాయిని (Rank) తెలుసుకోవచ్చు. ఇదే విధంగా వివిధరంగాల్లో [వ్యవసాయం, పారిశ్రామికాభివృద్ధి, విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలు, బాంకింగ్ సౌకర్యాలు, సాంఘిక సేవలు] ఒక్కో జిల్లాకు వచ్చిన సాపేక్ష స్థానాలనుబట్టి (Relative Ranks) మార్కులను (Reserved Ranks) వేసి, వివిధ రంగాల్లో ఒక్కోజిల్లాకు వచ్చిన మార్కులను కలిపి (Adding), జిల్లాలన్నిటిని సమిష్టి మార్కుల (Total Marks of a District) ప్రాతిపదికపై అవరోహణక్రమంలో వ్రాస్తే, అభివృద్ధి పథంలో స్థూలంగా ఒక్కో జిల్లాయొక్క స్థానం తెలుస్తుంది. ఇది జిల్లాయొక్క అభివృద్ధిని ఏ ఒక్క రంగంలోనోగాకుండా, అన్ని రంగాల్లో దానికిఉన్న సమగ్ర స్థానాన్ని తెలియజేస్తుంది. అంటే, జిల్లాలయొక్క సర్వతోముఖాభివృద్ధికి ఇది ఒక స్థూలమైన సూచిక. ఈ సూచికను తయారు చేయటంలో అన్నిరంగాలుసమప్రాముఖ్యమైనవిగా భావించామే గాని, ఒకరంగం ఎక్కువ ప్రాముఖ్యం గలదిగానూ, వేరొక రంగం తక్కువ ప్రాముఖ్యం గలదిగానూ భావించ లేదు. అంటే ఏ ఒక్క రంగానికి ప్రత్యేకమైన గురుత్వాన్ని (Weightage) ఇవ్వలేదు. ఒక్కో రంగంలో ఒక్కోజిల్లా మార్కులను, అన్ని రంగాల్లో సమిష్టిగా జిల్లాలయొక్క మార్కులనూ స్థానాలనూ సూచించే వివరాలను, ఒకటో నంబరు పట్టికలో చూపినాము.

# పట్టిక 1: వివిధ రంగాల్లో జిల్లాల అభివృద్ధి

| జిల్లా | వ్యవసాయ రంగంలో జిల్లా మార్కులు | విద్యుచ్ఛక్తి పరిశ్రమల రంగంలో జిల్లా మార్కులు | [illegible] రంగంలో జిల్లా మార్కులు | సాంఘిక సేవల రంగంలో జిల్లా మార్కులు | బాంకింగ్ రంగంలో జిల్లా మార్కులు | [illegible] జిల్లా మార్కులు | అన్ని రంగాల్లో జిల్లా మొత్తం మార్కులు | జిల్లా యొక్క స్థానం (Rank) |
|---|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) |
| శ్రీకాకుళం | 14.5 | 4 | 11 | 6 | 5 | 12 | 52.5 | 15 |
| విశాఖపట్నం | 14.5 | 14 | 11 | 13.5 | 17 | 16 | 86 | 6 |
| తూర్పు గోదావరి | 17 | 17 | 18 | 18.5 | 16 | 17.5 | 104 | 5 |
| పశ్చిమ గోదావరి | 19 | 18.5 | 19 | 15 | 18.5 | 17.5 | 107.5 | 3 |
| కృష్ణ | 21 | 18.5 | 21 | 18.5 | 20 | 20 | 119 | 1 |
| గుంటూరు | 20 | 20 | 20 | 20 | 18.5 | 19 | 117.5 | 2 |
| ప్రకాశం | 9 | 16 | 11 | 9 | 9 | 4 | 58 | 11 5 |
| నెల్లూరు | 13 | 9 | 17 | 17 | 14 | 10 | 80 | 7 |
| కర్నూలు | 3.5 | 15 | 13 | 13.5 | 15 | 13 | 73 | 9 |
| అనంతపురం | 1 | 8 | 8 | 11 | 13 | 14 | 55 | 13 |
| కడప | 9 | 6.5 | 15 | 12 | 10 | 5.5 | 58 | 11.5 |
| చిత్తూరు | 7 | 6.5 | 16 | 16 | 12 | 10 | 67.5 | 10 |
| హైదరాబాద్ | 11.5 | 21 | 9 | 21 | 21 | 21 | 104.5 | 4 |
| నిజామాబాద్ | 18 | 12.5 | 14 | 8 | 11 | 15 | 78.5 | 8 |
| మెదక్ | 2 | 5 | 5 | 3 | 7 | 7 | 29.0 | 19 |
| మహబూబ్‌నగర్ | 5.5 | 2 | 4 | 2 | 3 | 1 | 17.5 | 21 |
| నల్గొండ | 5.5 | 3 | 7 | 5 | 1 | 2 | 23.5 | 20 |
| వరంగల్ | 16 | 10 | 1 | 10 | 8 | 8 | 53 | 14 |
| ఖమ్మం | 11.5 | 1 | 6 | 7 | 5 | 3 | 33.5 | 17 |
| కరీంనగర్ | 9 | 12.5 | 2 | 1 | 2 | 10 | 36.5 | 16 |
| ఆదిలాబాద్ | 3.5 | 11 | 3 | 4 | 5 | 5.5 | 32 | 18 |

సూచన: ఒక్కోరంగంలో ఒక్కోజిల్లా మార్కులు అభివృద్ధి సూచికల ప్రాతిపదికపై నిర్ణయించబడింది. గణాంక వివరాలకు ముఖ్య ఆధారాలు.

(1) STATISTICAL ABSTRACT OF A. P.

(2) A. P. Five Year Plan – Draft Outline.

(3) R. B. I BULLETIN April 1973.

పైన వివరించిన పద్ధతిప్రకారం, రాష్ట్రం లోని జిల్లాలను, ఆర్థిక అభివృద్ధిదృష్ట్యా, 4 తరగతులుగ కింద కనపరచిన వరసక్రమంలో వ్రాయవచ్చు.

ఒకటో తరగతి :— కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, హైదరాబాద్, తూర్పు గోదావరి.

రెండో తరగతి :— విశాఖపట్నం, నెల్లూరు, నిజామాబాద్, కర్నూలు, చిత్తూరు.

మూడో తరగతి:— కడప, ప్రకాశం, అనంతపురం, వరంగల్, శ్రీకాకుళం.

నాల్గో తరగతి :— కరీంనగర్, ఖమ్మం, ఆదిలాబాద్, మెదక్, నల్గొండ, మహబూబ్ నగర్.

రాష్ట్రంలోని జిల్లాలయొక్క నేటి పరిస్థితిని, ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటికి పరిస్థితితో పోలిస్తే, జిల్లాల సాపేక్షస్థితిలో పెద్ద మార్పులు ఉన్నట్లు కనుపించదు. ఆనాడు అభివృద్ధిచెందిన జిల్లాలే, ఈ నాటికీ అభివృద్ధి చెందిన జిల్లాలు. ఆ నాడు వెనకబడ్డ జిల్లాలు, ఈనాటికీ వెనకబడి ఉన్నాయి. కాకుంటే విశాఖపట్నం, చిత్తూరులాంటి రెండు, మూడు జిల్లాలు మాత్రం, అప్పటికంటే ఇప్పుడు కొంత మెరుగయిన స్థితిలో ఉన్నట్లు కనబడుతుంది. ఈ పరిస్థితిలో వింత ఏమీ లేదు. దేశంలో కూడా, ప్రణాళికల ప్రారంభంనాటికే పురోగామి రాష్ట్రాలుగ ఉన్నవే, 20 సంవత్సరాల తర్వాత, మరింత అభివృద్ధి చెందిన రాష్ట్రాలుగ బలపడ్డాయి. ఆనాడు అంట్లో, ఇంతో వెనకబడిఉన్న రాష్ట్రాలు ఈనాటికీ వెనకబడి ఉన్నాయి. అంటే అభివృద్ధి చెందిన ప్రాంతాలే, అభివృద్ధికిగల అవకాశాలను వినియోగించుకొని మరింత అభివృద్ధిని సాధించాయి. వెనకబడ్డ ప్రాంతాలు అవకాశాలను వినియోగించుకోలేక గాని, అవకాశాలు పూర్తిగ లేనందువల్లగానీ, వెనకబడ్డ ప్రాంతాలు గానే మిగిలిఉన్నాయి.

కాబట్టి వెనకబడ్డ ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేకంగ నిధులను కేటాయించి, ప్రత్యేక శ్రద్ధ తీసికోనిదే, అవి అభివృద్ధి చెందిన ప్రాంతాల పోటీని ఎదుర్కొని పురోగమనం చెందలేవు. వెనకబడ్డ ప్రాంతాలను అశ్రద్ధ చేయటంవల్లనే, దేశంలోని చాలా ప్రాంతాల్లోను, ఆంధ్రప్రదేశ్‌లోను, ఆందోళనలు, అలజళ్లు ఏర్పడ్డాయి. ఈ ఆందోళనలు, అలజళ్లు ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి కార్యక్రమాలు మందకొడిగా సాగడానికి, లేదా అభివృద్ధి స్థంభించి పోవటానికి దోహదం చేశాయి. దారిద్ర్యం అన్నది ఏమూల ఉన్నా అది సంపన్నతకు, అభివృద్ధికి ఎప్పుడూ ప్రమాదకరమే.

కాబట్టి వెనకబడినతనంవల్ల, ఆర్థిక అసమానతలవల్లా ఏర్పడే--ఆందోళనలు, అభివృద్ధి కార్యక్రమాలను మరింత కుంటుపరిచి, రాజకీయ, సాంఘిక అస్థిరతలకు మరింతగా దారి తీయకముందే ఈ వెనకబడ్డ ప్రాంతాల అభివృద్ధికి గట్టి కృషి చేయాలి. అంతేకాదు. ఒక జిల్లా, ఒక రంగంలో సాధించగల అభివృద్ధి, ఇతర రంగాలలో సాధించిన అభివృద్ధిపై కూడ ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు రెండవ నంబరు పట్టిక, ఒక రంగంలోని అభివృద్ధి ఇతర రంగాల్లోని అభివృద్ధిపై ఏవిధంగా ఆధారపడిఉన్నది తెలియచేస్తుంది. దీనినే కోటి సహసంబంధ మాత్రికల పట్టిక అంటారు. (Rank Correlotion Matri-ces.)

## పట్టిక 2: సహసంబంధ మాత్రికలు

| | వ్యవసాయము | విద్యుచ్ఛక్తి పరిశ్రమలు | రవాణా సౌకర్యములు వార్తా ప్రసారములు | సాంఘిక సేవలు | బ్యాంకింగ్ రంగం | జనాభా సాంద్రత మొదలైనవి |
|---|---|---|---|---|---|---|
| 1. వ్యవసాయం | — | 0.931 | 0.931 | 0.921 | 0.919 | 0.933 |
| 2. విద్యుచ్ఛక్తి పరిశ్రమలు | — | — | 0.920 | 0.945 | 0.964 | 0.965 |
| 3. రవాణా సౌకర్యములు, వార్తా ప్రసారములు | — | — | — | 0.962 | 0.956 | 0.935 |
| 4. సాంఘిక సేవలు | — | — | — | — | 0.984 | 0.958 |
| 5. బాంకింగ్ రంగం | — | — | — | — | — | 0.977 |
| 6. జనాభా సాంద్రత మొదలైనవి | — | — | — | — | — | — |

ఒక రంగంలో సాధించగల అభివృద్ధి ఇతర రంగాల్లో సాధించిన అభివృద్ధితో సన్నిహిత సంబంధం కలిగి, ముడిపడి ఉందని, పై పట్టికవలన తెలుస్తుంది. అంటే జిల్లాలు సర్వతోముఖాభివృద్ధిని పొందాలి అంటే, అనేక రంగాల్లో అభివృద్ధికోసం ఏక కాలంలోనే కృషి చేయడం అవసరమని తెలుస్తుంది.

ప్రత్యేకంగా ఒక్కో రంగంలో, రాష్ట్రంలోని జిల్లాల మధ్య ఉన్న వ్యత్యాసాలను, అంతరాలను పరిశీలిస్తే, వ్యవసాయరంగంలో జిల్లాల మధ్య అసమానత, తక్కువగా ఉన్నట్టు కనుపిస్తుంది. రవాణా సౌకర్యాలు వార్తాప్రసారాల రంగంలోను బాంకింగ్ రంగంలోను, సాంఘికసేవల రంగంలోను ఈ అసమానతలు హెచ్చుగా ఉన్నాయి. ఈ వివరాలన్నీ కింద ఇచ్చిన 3 వ నంబరు పట్టికలోనుండి గ్రహించవచ్చు. వీటినే విచలనాంకము లనిగాని విచరణ గుణకాలు (Co-efficient of Variation) అనిగాని అంటారు. గుణకం హెచ్చుగా ఉంటే అసమానత ఎక్కువగా ఉందని తెలుస్తుంది. జిల్లాల మధ్యగల అసమానతలను తగ్గించాలంటే వెనకబడ్డ జిల్లాల్లో రవాణా సౌకర్యాలు, వార్తాప్రసారాల రంగాన్ని, బాంకింగ్ రంగాన్నీ, సాంఘికసేవల రంగాన్నీ ప్రత్యేకించి అభివృద్ధిపరచాలని కింద ఇచ్చిన పట్టిక తెలుపుతుంది.

పట్టిక 3 : విచరణ గుణకము
లేదా విచలనాంకము

| | | |
|---|---|---|
| 1) | వ్యవసాయం | 20.1 |
| 2) | విద్యుచ్ఛక్తి పరిశ్రమలు | 31.8 |
| 3) | సాంఘిక సేవలు | 47.7 |
| 4) | బాంకింగ్ రంగం | 52.8 |
| 5) | రవాణా సౌకర్యాలు, వార్తాప్రసార సౌకర్యాలు | 69.6 |

వెనకబడ్డ ప్రాంతాల అభివృద్ధికి, కేటాయించే ధనాన్ని, 3 ప్రాంతాల్లో ఏ నిష్పత్తిలో ఖర్చు పెట్టాలనేది ప్రణాళికా సంఘంవారు నిర్ణయించినట్టు తెలుస్తున్నది. కాని వెనకబడ్డ ప్రాంతాల అభివృద్ధి అన్నప్పుడు, జిల్లాల ఎన్నిక నిధుల కేటాయింపు ప్రాంతాలవారీగా కాకుండా, రాష్ట్రవ్యాప్తంగా చేయడం సబబుగా కనుపిస్తుంది. పైన ఇచ్చిన వివరణబట్టి రాష్ట్రంలో పది జిల్లాలు కొంత మెరుగయిన స్థితిలో ఉన్నట్టు మిగిలిన 11 జిల్లాలు వెనకబడి ఉన్నట్టు తెలుస్తుంది. కాబట్టి ఈ 11 జిల్లాలు ఏ ప్రాంతాలకు చెందినవి అనే విషయంతో ప్రమేయం లేకుండా రాష్ట్రంలోని వెనకబడ్డ జిల్లాలు అనే ఉద్దేశ్యంతోనే వీటిని అభివృద్ధిపరిస్తే, ప్రాంతీయ తత్వం కొంతయినా తగ్గడానికి అవకాశముంటుంది. అంతేగాక ఈ 11 జిల్లాల్లో కూడా మరింత వెనకబడ్డ ప్రాంతాలకు ఎక్కువ ధనాన్ని, మిగిలినవాటికి తక్కువ ధనాన్ని కేటాయించడం సబబుగా ఉంటుంది. అట్లాగాక ఈ ప్రాంతీయ తత్వాన్ని మనం అధిగమించలేనప్పుడు, కోస్తా ప్రాంతంలో శ్రీకాకుళం ప్రకాశం జిల్లాలకు, రాయలసీమలో అనంతపురం, కడప జిల్లాలకు తెలంగాణాలో మహబూబ్‌నగర్ నల్గొండ మెదక్ ఆదిలాబాద్ ఖమ్మం కరీంనగర్ వరంగల్ జిల్లాలపు ప్రత్యేక శ్రద్ధ చూపవలసి ఉంటుంది. ఈ జిల్లాల సత్వర అభివృద్ధికి ఏ ఏ ప్రాజెక్టుల్ని, ఏ ఏ స్కీములను అమలు జరపాలి అనే విషయాన్ని, జిల్లా అభివృద్ధి బోర్డులు, ప్రాంతీయ అభివృద్ధి బోర్డులు నిరయించార్సి ఉంటుంది. కేవలం ధనం ఖర్చు చేయడమే ఉద్దేశ్యం గాక, ఏ స్కీములవల్ల జిల్లాలో ఉత్పత్తి, ప్రజల సగటు ఆదాయం పెరుగుతూ ఉండటానికి అవకాశముందో వాటిని మాత్రమే ఎన్నికచేయార్సి ఉంటుంది. నూతనంగా చేకూరిన ఆదాయం విలాసవస్తువుల వినియోగంకోసం వృథాగాకుండా, వస్తూత్పత్తికై తిరిగి ఉపయోగపడేట్టు చూడాల్సిన బాధ్యతనుకూడ అభివృద్ధి బోర్డులు చేపట్టాలి. అప్పుడే మొదటపెట్టిన పెట్టుబడికి సార్ధకత చేకూరి అది అనేకమార్లు ఉత్పత్తిని పెంచటానికి ఉపయోగపడి జిల్లాయొక్క సత్వర అభివృద్ధికి దోహదం చేయగలదు.

వెనకబడ్డ జిల్లాల అభివృద్ధి అనగనే, సాపేక్షంగా అభివృద్ధిపొందిన ప్రాంతాలను ఉపేక్ష చేయాలనిగాని, విస్మరించాలనిగాని అర్థంకాదు. ఆర్థికంగా ఎంతో వెనుకబడిఉన్న ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధిచెందిన జిల్లాలనదగినవికూడ, దేశంలోని అభివృద్ధిచెందిన రాష్ట్రాల్లోని జిల్లాలతో పోల్చినప్పుడు ఎంతో వెనకబడఉన్నట్టు తెలుస్తుంది. కాబట్టి అన్ని జిల్లాల్లోను అభివృద్ధి కార్యక్రమాలను మామూలుగానే సాగిస్తూ వెనకబడ్డజిల్లాల అభివృద్ధికి మరింత ప్రాధాన్యత ఇవ్వడం అవసరం.

# తెలుగు పలుకుబడిలో పరిహాసము

"సుచంద్ర"

'వన్ధ్యా సా సాహితీ విద్యా భావార్థ పదనాదినీ
లభ్యతి యత్కటాక్షేణ వివేకానంద వాహినీ'

సత్యశివసుందర సమ్మిళితమైనది సాహిత్యము. అందలి ప్రక్రియలలో శతకము శతధా రసానంద సంధాయి. శతక మనగా నూఱు పద్యముల కూడిక. ప్రతి పద్యాంతమున మకుటము నిర్బంధము కాకపోయి నను నియమము. ఇట్టి శతక వాఙ్మయమున హేళన శతకము లొక కొన్ని సంప్రదాయ సిద్ధముగ నిలచి యున్నవి. హేళనమన తెగడిక. వ్యక్తినో, సంఘమునో, సంస్కారేచ్ఛమై సలుపు తిరస్కారము హేళనము. కొండొకచో హాస్యము పరిహాసమున కుపాంగమగును. హాస్యముతో బొదిగిన హేళనము తేనెలో ముంచిన ముల్లువలె యెదలో దిగును; సద్యః ఫలితముల నిచ్చును. పరుల సంతసపరచి, తాను సంతృప్తిపడు హేళనము పల్లెపాటలలో ద్యోతకము. 'బావా బావా పన్నీరు, బావను పట్టుకు తన్నేరు' ఇత్యాది హేళనమును సరాగ మనవచ్చును. ఇది పరిహాసమున మంద్రస్థాయి. పురాణ ప్రబంధ కావ్యములందలి హేళనము సాధారణముగ సరాగస్థాయి దాటిపోలేదు. అట్లు గాక హేళన శతకములు కొన్ని తెలుగు పలుకుబడి పొలపమున వర్ధిల్లి, పరిహాసమునే గాక జాతికి నీతిని బోధించి, ఆ వాఙ్మయమున నేరమైనవి. అట్టి వానిలో కొన్నింటిని సూక్ష్మేక్షికతో బరామర్శింతము.

భక్తకవులు కృష్ణపరముగనో, శంకరపరముగనో వ్రాసిన హేళన శతకములు వ్యాజస్తుతులు. స్తుతి గర్భితమైన నింద వ్యాజస్తుతి. కానుల పురుషోత్తను కవి నూటికి నూఱు పాళ్లు ఇట్టి కవియే. ఆతని ఆంధ్రనాయకశతకము మున్నెన్నదగినది; అందలి నూఱు పద్యములు నిట్టివే.

'ఆలు నిర్వాహకురాలు భూదేవియై
యఖిలభారకుడన్న యాఖ్య దెచ్చె
నిష్టసంపన్నురా లిందిర భార్యయై
కామితార్థదుడన్న ఘనత దెచ్చె
గమల గర్భుండు సృష్టికర్త తనూజడై
బహుకుటుంబికుడన్న బలిమి దెచ్చె
గలుష విధ్వంసిని గంగకుమారియై
పతితపావనుడన్న ప్రతిభ దెచ్చె
ఆంధ్రుబిడ్డలు దెచ్చు ప్రఖ్యాతిగాని
మొదటినుండియు నీవు దామోదరుడవె
చిత్రచిత్ర ప్రభావ! దాక్షిణ్యభావ
హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!

ఇందులకు వ్యతిరిక్తముగా పైకి స్తుతిగా, గర్భితమున నిందగా దోపింపజేయు సన్నివేశములును సాహిత్యమున కానవగును. సంస్కృతమున గల యొక చాటుశ్లోక మిందుల కుపబలకము. భార్యా విధేయుడైన యొక 'శిరస్తాదారు' గూర్చిన కవితెగడ్త యిది.

'ముఖస్థదారోః భగవాన్విధాతః
ఉరస్థదారోః భగవాన్రమేశః
పార్శ్వస్థదారోః భగవానుమేశః
శిరస్థదారౌత్వ చనత్వ దన్యః'

—శబ్దగత చమత్కార సల్లాపమిది.

ఉత్తమధ్వని కావ్యమగు తిక్కన విరాట పర్వములో సైరంధ్రి నిందాగర్భితమైన స్తుతి యిది.

'నాడు వల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారి యట్లు పిన్నవారు
గాన పతుల విధముగా గాక యేశైలూషి
గాన సలరాదు కంకభట్టు.'

—'యద్యతాచరతి శ్రేష్ఠః తత్తదేవే తరేజనాః'

అన్న సూక్తి ననుసరించినట్లు జెప్పుచు భర్తలోని నటనను (ఎఱుగనట్లుండుట) విమర్శించుచున్నది.

పరిహాసమన్నది హేళనకు బర్యాయపదము. ఆంగ్లమున దీనిని 'Satire' అందురు. తన మొగము తప్ప పెఱమొగములన్నింటి నగపఱచు ముకురమే హేళనమని 'Swift' నిర్వచనము. ముకుళించుకొన్న యంతరాత్మల వికసింపించు సూటిపోటు హేళనము. మనోవ్యాధిగ్రస్తులకు సూదిమందు. మానవదోషముం జల్లించి జెరుసుకాళ్ళుతేర్చు వాఙ్మయపు జల్లెడ హేళనము. గుణములు దోషములుగ తెగడబడుట హేళనముకాదు; దూషణము. కవి యావేశ వివశుడైనచో దూషణదోష దష్టుడగును. కనుక హేళన కావ్యనిర్మాణ మసిధారావ్రతము వంటిది.

భక్తిశతకములలోవలెనే హేళన శతకములలోను లక్ష్యము ధర్మార్థ కామవైరాగ్యబోధ. ఇవి ప్రవృత్తి మార్గమును సంస్కరింప, భక్తిశతకములు నివృత్తి మార్గమును సంస్కరించును. హేళన శతకకర్త హాస్య కుశలుడు కానిచో 'తిట్టుబోత'ని నిందవడును. ఆంగ్ల రచయితలలో 'డ్రైడన్' పరిహాస శిల్పికాగా 'పోపు' తిట్టుబోతనిపించుకొనెను. తెలుగు సాహిత్యములో పలుకులో తూనిక, ములుకులో వాడిమిగల వేమనాదులు పరిహాస కవిబ్రహ్మలుకాగా, రావణదమ్మీయ, చంద్రరేఖా విలాసకర్తలు లక్ష్మణ, జగ్గకవులు దూషణ కవులుగా యపప్రథ నందిరి. నీతిపరుడుకాని రచయిత యవినీతిని చిత్రింపవచ్చినచో, దనచిత్రమే యందులో ప్రతిబింబించి, ఆత్మవంచనకరము, అవహేళన పాత్రమగు నాకావ్యము. నవ్వింపబోయి నవ్వుల పాలగును. లబ్ధప్రతిష్ఠులగు కొందర బరిశీలింతము.

వేమన: 'నానృషిఃకురుతే కావ్యమ్'అన్న సూక్తి కన్నమైన నిధానము వేమన. కావుననే మనకవియై మహాకవియైనాడు. రాగము, విరాగము, భోగము, యోగము నంటియునంటక చేబట్టిన తత్త్వవేత్త. 'ఉత్తముల మహిమ నీటికొలది తామరసుమ్మీ' యన్న కోవ కినయైనవాడు. హాస్యరస వైచిత్రియందు సర్వాంగీణ పరిష్వంగము నందుకొన్నవాడు. ఛలోక్తి, నర్మోక్తి, సరసోక్తి, విరసోక్తి, చమత్కృతి, నిరాకృతి సకలములు వేమయ్యకు బుక్కిలింతలు. సన్న్యాసి ముండనము నిత డెంత సరసముగ సలిపినాడో చిత్తగింపుడు.

'సతుల గవయనేల? సుతుల బడయనేల?
వెతలు పడగనేల? వెఱ్ఱితనము
నేలమీది రాయి నెత్తికెత్తిన యట్లు
విశ్వదాభిరామ వినురవేమ.'

'ఆకులన్నిదిన్న మేకపోతుల కేల
కానపోయెనయ్య కాయసిద్ధి,
లోకులెల్ల వెఱ్ఱిపోకిళ్ళ బోదురు
విశ్వదాభిరామ వినురవేమ?'

లోభివాని జేసిన చిత్రవధ చూడదగినది.

'గొడ్డుటావు బితుకఁగుండ గొంపోయిన,
పండ్లురాలదన్ను పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా,
విశ్వదాభిరామ వినురవేమ.

పరిహాస సమ్మిశ్రితములై, సంస్కరణాభ్యుదయము గల వేమన పద్యము లన్నియు అక్షరలక్షలే. ఎన్నని యుటంకించుట?

కవి చౌడప్ప:—'బూతాడక దొరకునవ్వు పుట్ట' దన్న కవి చౌడప్ప ధోరణి ధోరణాంకుశము. కవుల కిమ్మని, యిప్పింపుమని యితదు మంత్రులకు, రాజులకు వేసిన చురకలే తన్నిదర్శనములు.

'ఇయ్యగ నిప్పించంగల
యయ్యలకేగాని మీస మందఱకేలా?
రొయ్యకు లేదా బారెడు
కయ్యమునకు? గుందవరపు కవి చౌడప్పా?'

'ఏమియ్యని దొర పద్యము
నామంబిడి చదువుటెల్ల నాలుక లీటా?
రామకథా భారతమా?
కామింపగ? గుందవరపు గవి చౌడప్పా?

వేమనను దలపించుచు నితడు జేసిన లుబ్ధ నిగర్హణ మిది :

అతిలుబ్ధు వేడబోయిన
వెతనొందుచు వాని మోము వెలవెల బాఱున్
అతిసార రోగపీడితు
గతి, నప్పు కుందవరపుఁ గవి చౌడప్పా!'

ఇతని ఆ క్షేపణమునకు ముడివస్తువులు. దేవుడు—దేవాలయము; రాజు—రాజసభ; దాత—లోభి; సంసారి—వ్యభిచారి; ధనికుడు—నిర్ధనుడు; వేషము—భాష—ఇత్యాదులు.

అడిదము సూరన:—ఇతని చురకలు వ్యంగ్య విశిష్టమైన లోకనిగర్హణమునకు జాలినవి. మచ్చున కొక్కటిఁ దిలకింతము.

'ఆపన్నరక్ష సేఁసుడుగాని సజ్జన
పీడనం బొనరింపఁ బిడుగుతునక
నయశాస్త్ర గరిమపూనడుగాని దుర్ణయ
వ్యాపారమునకు సిద్ధాంతవేత్త
కాసైనఁ దన సొమ్ము ఖర్చు సేయడు గాని
పరుల సొమ్ము హరింప బ్రహ్మకాయ
కలనైన సత్యంబుఁ బలుకనోపడు గాని
యనృతంబు లాడ సహస్రముఖుడు
అనుచుఁ దనదు చరిత్రంబులవని జనులు
నింద సేయగఁ బ్రదుకు దుర్నీతి నృపుని
వైభవం బౌరయని మెచ్చువాడె జడుడు
రామలింగేశ! రామచంద్రపురనివాస!

ఇందులో పిడుగుతునుక, సిద్ధాంతవేత్త, బ్రహ్మ కాయ మున్నగు వాడుకలోని గుణవాచక నామములే హేళన కెంతో యుపకరించినవి.

పై రీతిగ సున్నితముగ జక్కిలింతలకు దిగుచు కొందఱు, చుఱుకుచుఱుకున తేనె తీపులములు మొనలు సవరించు నొరవడిన కొందఱు, కేవలము నిట్టనియువ చిటుకుచిటుకునఁ గుట్టుకటికతన మున కొందఱు తెలుగు పలుకుబడిని సహస్రారము విశ్లేషించుచు, బలుతెగల పరిహాసమున రసబ్రహ్మము నందికొనిన తెలుగు హేళన శతకకవులు సాహితీ లోకమున చిరస్థాయులు; చిరంజీవులు.

'జయన్తి తే సుకృతినోః రససిద్ధాః కవీశ్వరాః
యేషామ్ నాస్తియశః కాయే జరామరణజమ్
భయమ్.'

---



# కలగూరగంప

## ''ఈషణ—ఏషణ''

శ్రీ పమిడికాల్వ చెంచుసుబ్బయ్యగారు ఏప్రిల్ భారతిలో 'శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్రము'ను సమీక్షించుచు 'ఈషణ త్రయము'ను పదము వ్యవహారమునుబట్టి ప్రయోగించుట జరిగినదనియు, అది 'ఏషణత్రయ'మని యుండిన సాధువనియు తెలిపియున్నారు. దానిపై శ్రీ బండి నాగరాజుగారు జూలై భారతిలో లేఖ వ్రాయుచు తాము ఈషణత్రయమే సాధువని భావించుచున్నట్లును, ఏషణత్రయ పద సాధుత్వమునుగూర్చి తమకు తెలియదనియు తెలిపియున్నారు. ఈ శబ్దముల సాధుత్వాసాధుత్వ విషయమున నాకు కలిగిన యభిప్రాయమును పాఠకులకు మనవి చేయుచున్నాను.

శ్రీ సుబ్బయ్యగారు చెప్పినట్లుగ 'ఈషణ' యనుపదము వ్యవహారమునుబట్టియే ప్రయోగింపబడుచున్నది కాని యది పాణినీయము ప్రకార మసాధువే. ఎట్లన తౌదాదికమగు 'ఇషు'=ఇచ్ఛాయాం అను ధాతువుపై యుచ్ (లేక ల్యుట్) ప్రత్యయమును, దానికి 'అన' ఆదేశమును, 'పుగంత లఘూపధస్య చ' అను సూత్రముచే గుణమును రాగా 'ఏషణ' అనియే సిద్ధించును— ఇట గుణ మనివార్యమగుటచే 'ఈషణ' యను రూపమేర్పడుట కవకాశములేదు. గుణము రాకున్నను ఇష్ ధాతువులోని ఇకారమునకు దీర్ఘము వచ్చు మార్గమును లేదు. కనుక ఇష్ ధాతువుపై 'ఈషణ' అను రూప మేర్పడదు. ఈష్ ధాతువుపై యుచ్ ప్రత్యయమో, ల్యుట్ ప్రత్యయమో చెప్పి 'ఈషణ' పదమును సాధింతమన్నను ఇచ్ఛార్థకమగు ఈషధాతువు లేదు— కనుక ఇష్ధాతువుపై యుచ్ ప్రత్యయము వచ్చినచో ఏషణా అను స్త్రీలింగ రూపమును, ల్యుట్ ప్రత్యయము వచ్చినచో 'ఏషణమ్' అను నపుంసక లింగరూపమును ఏర్పడును. ఇచ్ఛార్థమున ఈ రెండు పదములే పాణినీయములు. 'ఈషణ' పద— మిచ్ఛార్థమున అపాణినీయమే. కనుక దారైషణమ్ ఇత్యాదులే సాధువులు.

సుప్రసిద్ధ పండితులు శ్రీ తారానాథ తర్కవాచస్పతి భట్టాచార్యులు కూర్చిన 'వాచస్పత్యము' నందలి ఈ పదమును గూర్చిన వివరములను పాఠకులు గమనింతురుగాక.

ఏషణః— ఇష ఇచ్ఛాయాం, ణిచ్, భావే యుచ్. ఏషణా పేరణాయాం పుత్రలోక విత్త కామనాయాం చ. స్త్రీ. 'న కశ్చిదన్యః సంసార ఉక్త్వా దస్త్యేషణాత్రయాత్ (వేదాం.) 'యా హ్యేవం పుత్రైషణా సా విత్తైషణా యా విత్తైషణా సా లోకైషణా భే హ్యేతే ఏషణే భవతః'— శ. బ్రా. 14–6,4,1.

—శ్రీ ఆర్. శ్రీహరి.

## ఈషణత్రయము— ఏషణత్రయము

ఏప్రిల్ నెల భారతిలో 'శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్ర' మను కావ్యాన్ని సమీక్షిస్తూ, నేను అందరి 'ఈషణత్రయము' అను ప్రయోగాన్నిగూర్చి 'ఈషణత్రయమను వ్యవహారమునుబట్టి ప్రయోగించుట జరిగినది. ఇట ఏషణత్రయమని యుండిన సాధువు' అని వ్రాయగా, జూలై భారతిలో శ్రీ బండి నాగరాజుగారు దీన్ని ఆక్షేపిస్తూ గ్రాంథ్యాదులలో ఈషణ మనియే ఉన్నదనీ, 'దారేషణ' ఇత్యాదుల్లో పదచ్ఛేద మెట్లో తెల్పవలసినదనీ వ్రాసినారు. అందులకు సమాధానము:—

ఇది సంస్కృతపదము. కనుక దీని సాధుత్వాసాధుత్వాలను ఆ భాషానియమాలవల్లనే నిర్ణయించవలసియున్నది. సంస్కృత నిఘంటువులం దెచ్చటను 'ఈషణ' శబ్దము 'కోరిక' అనే అర్థంలో కన్పట్టదు. గురుబాలప్రబోధికలో 'ఇచ్ఛా' శబ్దవ్యుత్పత్తివద్ద 'ఏషణమిచ్ఛా.' అనియే కలదు. అంతేగాని 'ఈషణమిచ్ఛా' అని లేదు. శ్రీ మామిడి వేంకటార్యులవారి 'శబ్దార్థ దీపిక'లో 'ఏషణ'మే ఈ యర్థంలో ఇవ్వబడింది. కాని తెలుగు నిఘంటువులైనవానిలో

బ్రౌణ్యము ఈషణ, ఇషణములను, ఆంధ్ర వాచస్పత్యము వీనికితో ఏషణ'మును; శబ్దరత్నాకరము మొదట ఇషణమును, అనుబంధమున ఈషణమును— 'కోరిక' అను నర్థంలో పేర్కొనియున్నవి. కాగా తెలుగు నిఘంటువుల ప్రకారం ఇచ్ఛార్థమున ఇషణ, ఈషణ, ఏషణము లున్నవనుట ఫలితాంశం.

ఇకపై వాని రూపనిష్పత్తి, సాధుత్వములను పరిశీలిద్దాం. (1) ఈషణా, ఈషణమ్—అను రూపములు 'కోరిక' అనే అర్థంలో సంస్కృత ప్రయోగాల్లో లేవు. అర్థాంతరమునమాత్రమే ఆ యర్థమును కుదుర్చుకోవాలి. 'ఈషగతి హింసాదానేషు' అను ధాతువుపై 'హేతు మణ్ణిచ్—యుచ్— చేసినచో 'ఈషణ'రూపము సిద్ధించును. కాని అపుడు దీనికి 'కోరిక' అనే అర్థాన్ని సంస్కృత ప్రామాణికులు తెల్పలేదు. కనుక ధాతువులకు అనేకార్థములు చెప్పవచ్చునే సంప్రదాయాన్ని ఆశ్రయించాలి. ఇది అగతిక గతికము!

ఇషధాతువులు మూడు కలవు. (1) 'ఇష' లేదా 'ఇషు'—ఇచ్ఛాయాం (తుదాదిః) దీనికి ల్యుట్ ప్రత్యయము, 'అన' ఆదేశము, లఘూపధగుణము రాగా 'ఏషణమ్' అను నపుంసక రూపం వస్తుంది. అట్లే ణిచ్ ప్రత్యయము, యుచ్ ప్రత్యయము, ణిజ్లోపమురాగా 'ఏషణా' అగును. అపుడు 'కోరిక'— అని అర్థం.

(2) దివాదులలోని 'ఇష=గతౌ; (3) క్ర్యాదులలోని 'ఇష-ఆభీక్ష్ణ్యే' అను వానికిని 'యుచ్' రాగా 'ఏషణా' అనే స్త్రీలింగ రూపం వస్తుంది.

ఇందులకు ప్రమాణాలు. (1) లలితా త్రిశతిలో 'ఏషణా రహితాదృతా' అని నిర్వివాదంగా ఉన్నది. ఇచ్చట శాంకరభాష్యంలో, 'ఏషణా=ఇచ్ఛా. సా త్రివిధా. ఏతల్లోక జయాయ పుత్రైషణా; పితృలోక జయ సాధన కర్మ సంపాదనీయ విత్తైషణా; ఉపాసనాదినా జయసాధనం లోకః తస్మిన్నేషణా లోకైషణా'—అని కలదు. పై నామము కాది విద్యలోని రెండవ అక్షరమగు 'ఏ'తో ప్రారంభింపబడింది. ఇట 'ఈషణా' అనేందుకు వీల్లేదు. (2) బృహదారణ్యకోపనిషత్—5 అధ్యా—5 బ్రాహ్మణమున 'ఏతంవై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ, విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థాయ అథ భిక్షాచర్యం చరన్తి. యాహ్యేవ పుత్రైషణా, సావిత్తైషణా, యావిత్తైషణా సా లోకైషణా—ఉభేహ్యేతే ఏషణే ఏవ భవతః' అని కలదు. ఇక్కడ శాంకర భాష్యమునను, ఆనందగిరి వ్యాఖ్యయందును, 'ఏషణా' అను రూపమే గ్రహింపబడినది. మరియు, 'ఏషణా=కామః' అని శాంకరభాష్యంలో కలదు. ఇట రంగరామానుజభాష్యమున 'ఏషణా' అను రూపమే సాధింపబడియుండగా, వావిళ్లవారు 'పుత్రేషణా, విత్తేషణా, లోకేషణా' అని గుణసంధి రూపములతోనే ముద్రించినారు. మరి, 'ఈషణా' రూపమే రామానుజుల అభిప్రాయమైతే, అట వారిచ్చిన ప్రక్రియ వారికే విరోధిస్తుంది.

'ఇష' ధాతువులపై, ఏ యర్థములందునూ 'ఈషణ' రూపం సిద్ధింపదు. ఇది ముద్రాపకదోషం. ఇలాంటి వానిని చూచియే బ్రౌణ్యాదులు దారేషణ, ధనేషణ, ఇత్యాది గుణ సంధి రూపాలనే ఉదహరించాయి. ఇక వేమన ప్రయోగమునను (471) 'ఏషణత్రయము' అనుటయే ఉచితము. కాదేని, 'ఈష=గతి హింసా దర్శనేషు' అను ధాతువునకు ల్యుడంత రూపము 'ఈషణమ్' గనుక, దీనిని గ్రహించి, 'కోరిక' అనే అర్థం సరసంగా కుదురకున్నా—ఎలాగో సరిపెట్టుకోవాల్సివస్తుంది. ఈ అర్థంలో ప్రత్యేక ధాతువు లున్నపుడు—ఈ గొడవ వృధా గదా!

మరియూ, మల్లినాథాదులందరూ ప్రామాణికునిగా గ్రహించిన 'నానార్థార్ణవ సంక్షేప' నిఘంటుకర్త కేశవుడును, 'నారాచే పునరేషణః, నారాచ్యాం త్వేషణీ స్త్రీస్యాత్, కుస్తు మ్బుర్యాంతు స్యైషణా; ఇచ్ఛాయాం క్లీబ్చృతే, ర్త్వేతు వ్యాపారే, నప్ స్త్రియోర్యదా. ఏషణం చైషణా చేతిస్యాత్' అన్నాడు. దీనింబట్టి 'ఏషణః=ఇనుపబాణము; ఏషణీ=నారాచీ త్రాసు; ఏషణా (ఇష=గతౌ) కొత్తిమిరి; ఏషణమ్, ఏషణా (ఇష=ఇచ్ఛాయాం)=కోరిక అనే అర్థాలు సిద్ధిస్తున్నాయి. ఇక 'ఈష=ఉంఛే—(భ్వాది) ధాతువుంది. ఇది 'ఈషణమ్' అవుతుందిగాని 'ఉంఛన' మని అర్థం.

కనుకనే సూర్యరాయాంధ్ర నిఘంటువున, (1) 'ఈషణము=సం. వి. ఐ. (అ, ఆ, అ) త్వరపడునది; త్వరపెట్టునది; వి. అ. వ. త్వర. (2) ఏషణ= సం. వి. ఆ. స్త్రీ; (దారపుత్ర ధనాదులందలి) కోరిక;

(ఉదా॥ దారైషణ, పుత్రైషణ, ధనైషణ); కొత్తిమిరి; యాచన (3) ఏషణము=సం. వి. అ. పుం. ఇనుప అమ్ము; వ్రణ విచారణ వ్యాపార విశేషము, (4) ఏషణి–సం వి. ఈ స్త్రీ; నారాచి, త్రాసు, శలాక–అనియు గలవు. అంతేగాని 'ఇషణ' రూపము లేదు.

శ్రీ నాగరాజుగారు 2–8–'74 నాటి వారి లేఖలో (నాకు వ్రాసిన) సూర్య రాయాంధ్ర నిఘంటువులో రెండు రూపాలూ వున్నవి. మరి ఒకటి సాధువేమిటి? మరొకటి అసాధువేమిటి?' అని వ్రాసినారు. అచ్చట రూపాలున్నా యన్నారు గాని, అచ్చట ఆయా రూపాలకు వారిచ్చిన అర్థాలు గమనింపక పోవుట ఆశ్చర్యంగా వుంది. కనుక 'ఏషణా' మున్నగు సంస్కృత శబ్దముల రూపాలు, అర్థాలు నిర్ణయించటంలో ఆ భాషా నిఘంటువులు, వ్యాకరణాలు, మహా కవుల ప్రయోగాలు ప్రామాణ్యాలు. అంతేగాని, తెలుగు కావ్యాల్లో ప్రయోగించబడిన సంస్కృత శబ్దాలగూర్చి తెలుగు ఆచారం ప్రకారం చర్చించడం న్యాయం. దాన్ని సిద్ధాంత కౌముది సులోచనాలో చూచి, సాధువుకాదని కొట్టివేయుడం సరియైన సమీక్షా పద్ధతికాదని తలంచే పక్షంలో, ఇక దాన్ని సంస్కృత శబ్దమని వ్యవహరించాల్సిన పనేముంది? 'ఈషణము' అనేది అర్థాంతరమున 'కోరిక' అనే అర్థంలో లోకరూఢి అయింది కాబట్టే తెలుగు కవులు, తెలుగు నిఘంటుకారులు గ్రహించారు. అంతమాత్రాన అదే సాధువని తలంచితే, మరి లోక వ్యవహారంలో 'కమండలము'వంటి అసాధు శబ్దాలు ఎన్నో ఉంటాయి. ఇక అవన్నీ సాధువులు కావలసిందేనా? లోకవ్యవహారం, రూఢి వున్నది కాబట్టే నా సమీక్షలో 'వ్యవహారమును బట్టి ప్రయోగించుట జరిగినది' అని అంటూ 'అది' 'ఏషణ'మని యుండిన సాధువు' అని వ్రాసినాను.

కనుక 'ఈష' ధాతువునుండి వచ్చిన 'ఈషణ' శబ్దానికి 'కోరిక అనే అర్థం ప్రామాణికముగ సమ్మతమగుచో నా కభ్యంతరం లేదు. 'ఇష' ధాతువునుండి అయితేమాత్రం లఘూపధ గుణం విధిగావచ్చి, 'ఏషణ' రూపమే సిద్ధిస్తుంది.

ఈ, ఇషణ, ఈషణ, ఏషణ శబ్దాల సాధుత్వాసాధుత్వాల్లోగల నా సందేహాలను లేఖద్వారా తీర్చిన 'అభినవ నన్నపార్య' బ్రహ్మశ్రీ పిశుపాటి విశ్వేశ్వర శాస్త్రి (నెల్లూరు) గారికి నేనెంతయు కృతజ్ఞుడను. ఇన్ని విషయాలు తెల్సుకొనుటకు అవకాశం కల్పించిన శ్రీ బండి నాగరాజు గారికిని కృతజ్ఞుడను.

—శ్రీ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య.

# గుణాఢ్యుడు—హర్షుడు

భారతి జూన్ 1974 సంచికలో 'నాగానందము గుణాఢ్యుడు—హర్షుడు' అను వ్యాసం ప్రకటించబడింది. ఈ వ్యాస రచయిత డా. ముదిగొండ శివప్రసాద్‌గారు. ఈ వ్యాసంలో కొన్ని లోపాలు కన్పిస్తున్నాయి. వాటినెత్తి చూపడం ఈ వ్యాసముయొక్క ఉద్దేశం.

1. గుణాఢ్యుడు రచించిన బృహత్కథలోని జీమూతవాహనుని కథను హర్షుడు తన నాటకానికి ఇతివృత్తంగా తీసుకున్నాడు. హర్షుడు అమూలకమైన కొన్ని కల్పనలు చేశారు. అలాగే మూలాన్ని మరికొన్ని చోట్ల వదలివేశారు. 'ఆ తులనాత్మక పరిశీలనాన్ని ఈ వ్యాసంలో వివరిస్తాను. చిత్తగించండి.' అన్నారు శివప్రసాద్‌గారు. వదలి వేసినవి అని మూడు విషయాలను చెప్పారు. అందులో మొదటిది ఇలా ఉంది. 'మూలంలో జీమూతకేతువు ఉద్యానవనంలో ఒక కల్పవృక్షం వుంది. దానిని జీమూతవాహనుడు మానవాళి కోసం దానం చేస్తాడు. హర్షుడు ఈ వృత్తాంతాన్ని వదలివేశాడు' ఈ వృత్తాంతాన్ని హర్షుడు వదలివేయలేదని తెలియజేస్తున్నాను. 'దత్తోదత్త మనోరథాధిక ఫలః కల్పద్రుమోఽప్యర్థినే' అని జీమూత వాహనుడు విదూషకునితో చెప్పినట్లు నాగానందము ప్రథమాంకంలో హర్షుడు వ్రాశాడు. ఇక ఆ వృత్తాంతాన్ని హర్షుడు వదలివేసినట్లెలా అవుతుంది. గత ఇరవై సంవత్సరాల నుండి నాగానందాన్ని ఏదో ఒక రూపంలో ప్రతి నిత్యమూ చదివే అదృష్టాన్ని పొందిన డా. శివప్రసాద్ గారికి హర్షుని పై వాక్యం కంటబడలేదో—లేదా—మూలంలోవలె ఆవృత్తాంతాన్ని యథాతథంగా వ్రాస్తేనే వదలివేయనట్లో తెలియదు.

2. మూలమూ నాగానందమూ రెండూ చదివితే ఇరువురూ మహాకవులేననిపిస్తుంది మనకు – అని ఒక చోట, 'మూలకథఅనే బంగారాన్ని హర్షుడు

సువర్ణ కమలంగా దృశ్యంగా తీర్చిదిద్దాడు' అని వ్యాసాంతమున చెప్పిన శివప్రసాద్‌గారి మాటల్లో వైరుధ్యం కానవస్తుంది.

3. హర్షుడు వదలి వేసినవి, కల్పించినవేవో అవి చెప్పిన పిదప రచయిత ఇలా వ్రాశారు. ఇలా హర్షుడు ప్రశంసాపాత్రమైన మార్పులు కొన్ని చేసిన మాట వాస్తవమే! అయితే హర్షుడు తన్నుగూర్చి తాను 'నిపుణుడైన కవి'నని సూత్రధారుని ముఖతః చెప్పు కున్నారు...మూలం చూచేవరకూ నేనూ నిజమేనను కున్నాను. కాని ఇదంతా గుణాఢ్యుని కథలోనే వున్నది కదా! అమూలకంకాని ఈ కథా కౌశలానికి హర్షు డెలా ప్రశంసాపాత్రుడు? వైదిక—బౌద్ధ మతాల మధ్య సామరస్యం సాధించటంలో హర్షుడు కల్పించినదేది లేదు. అదంతా మూలంలో ఉన్నమాట నిజమే. మూలంలో ఉన్నదున్నట్లుగా విషయాన్ని చెప్పటం వల్లనే ఒక కవి నిపుణుడనిపించుకుంటాడు. మూల కథ ఆధారంగా స్వకపోల కల్పితమైన చమత్కారాలు, కవితా సౌందర్యాలుచేస్తూ ఆ కథను రసానుగుణంగా నాటకీకరించడమే ఒక గొప్ప నైపుణ్యం కాదా!

4. 'తన గొప్పతనానికి లోపం వస్తుందనే భయంతో గుణాఢ్యుడు వాడిన ఎన్నో అలంకారాలను పూర్తిగా హర్షుడు వదిలివేశాడు' అని చెప్పి నాలుగు అలంకారాలను ఉదాహరించి 'ఇవేవీ నాగానందంలో లేవు. అందుకు కారణం గుణాఢ్యుని అలంకారాలు యథాతథంగా వాడుకున్నాడని ఆక్షేపిస్తారేమోనన్న హర్షుని భయమే కారణం కావచ్చు. అంతే కాని ఈ గుణాఢ్యాలంకార చమత్కృతులు నచ్చక పోవడం కారణం కాదు.' అని డా. శివప్రసాద్‌గారన్నారు. దీనిని బట్టి శ్రీ శివప్రసాద్‌గారు శ్రీహర్షుని ప్రతిభ హీను నిగా లెక్కించినట్లు తోస్తుంది. అనువాదకుడైన ఒక కవి మూలకథను కథలోని భావాలను, అలంకారా లను యథాతథంగా వ్రాస్తేనేకాని అతడొక కవిగా నిపుణుడుగా లెక్కించబడడేమో డా. శివప్రసాద్‌గారి దృష్టిలో. సంస్కృత మహాభారతాన్ని తెనిగించిన కవి త్రయం మూలంలోని ఎన్ని అలంకారాలను వదలలేదు. ఎన్నిటిని కల్పించలేదు. అలాగే హర్షుడునూ. మూల కథాకారుడైన గుణాఢ్యుని రచనా పద్ధతి వేరు. హర్షుని రచనా పద్ధతి వేరు. కథాకథనము మూలకారుని ధ్యేయం. మూలకథను ఆధారంగా మాత్రం తీసు కొని తన ప్రతిభచేత దానిని రసవత్తరంగా నాటకీ కరించడం హర్షుని ధ్యేయం. అంతేకాని మూలకారుని అలంకారాలను వదలడం వదలకపోవడం హర్షుని భయాభయాలతో సంబంధం లేదు.

హర్షుడు వదలివేసినవని శ్రీ శివప్రసాద్‌గారు రుదా హరించిన నాలిగింటిలో మొదటి అలంకారాన్ని గురించి కొంత విచారించాలి. 'సౌపర్ణోపాఖ్యాన కథలో అమృతం నాకదలచిన నాగుల నాలుకలు చీలాయని చెపుతూ 'మిక్కిలి లోలగుణం కలవారు పరిహాసం పాలుకాకుండా ఎలా వుంటారు?' అని అర్థాంతరన్యాసాలంకారంలో గుణాఢ్యుడు చెపుతాడు' అని వ్రాశారు. వ్యాసం మొదట్లో హర్షుడు 'వదలివేసినవి' అని మూడు విష యాలను తెలిపారు డా. ప్రసాద్‌గారు. అందులో మూడవది ఇలా ఉంది. 'మూలంలో సౌపర్ణోపాఖ్యాన గాథ వుంది. దీనిని వివరంగా శంఖచూడుడు జీమూత వాహనునికి చెపుతాడు. హర్షుడు ఈ గాథను మొత్తాన్ని వదిలివేశాడు.' హర్షుడు సౌపర్ణోపాఖ్యాన గాథను మొత్తాన్ని వదిలేశాడని చెప్పి అందులోనిదే ఒక అలం కారాన్ని తీసుకొని దానిని హర్షుడు వదలివేశాడని చెప్ప డంలో అర్థ మేముంది. ఇది 'తలకాయే పోగా చెవుల పోగుల కేడ్చిన' సామెతలా ఉంది.

'మూలకథ అనే బంగారాన్ని హర్షుడు సు'వర్ణ' కమలంగా 'దృశ్యం'గా తీర్చిదిద్దా'డని అన్నప్పటికి శ్రీ హర్షునియెడ డా. శివప్రసాద్‌గారు నిరాదరణ భావాన్ని కలిగియున్నట్టు ఆయన వ్యాసంవల్ల తెలు స్తూంది. ఇది సరియైన దృక్పథం కాదు.

—శ్రీ ఎ. భూమయ్య.

# గ్రంథవిమర్శలు

## స్వవిషయం

(రెండవ భాగము)

(రచన : శ్రీ లింగం వీరభద్రయ్యచౌదరి బి. ఏ. (ఆక్సన్) ఐ. ఆర్. ఎస్. బారిస్టర్—ఎట్ లా. రిటైర్డ్ ఇన్‌కమ్‌టాక్సు కమీషనర్. పంపిణీదార్లు : త్రివేణీ పబ్లిషర్సు, మచిలీపట్నం—1, మదరాసు - 60001. మూల్యం : రు. 9.)

ఈ గ్రంథం మొదటి భాగంకంటే ఎక్కువ ఆసక్తికరమయినది—ప్రయోజనకరమయినదీ రెండవ భాగం. 393 వ పుటలో ప్రారంభమై 764 వ పుటతో పూర్తవుతుంది. 27–7–1973 న పూర్తి చేశారు ఈ భాగాన్ని.

ప్రొబేషనరీ ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు, యాక్టింగు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు, ఖాయమైన ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరు, ఇన్‌కమ్‌టాక్స్ అప్పిలేట్ అసిస్టెంటు కమిషనరు, అనే నాలుగు పెద్ద అధ్యాయాలున్నాయ్ ఈ భాగంలో. 1 ఉపశీర్షికలున్నయ్.

ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్లలో ఒకరు ఒకానొకప్పుడు 'మీరు మమ్మలను గురించి ఎక్కువగా అనుకొనుచున్నారు.' అన్నాడట. దానిమీదట చౌదరి గారికి చిర్రెత్తి 'నేను గొప్పవాడననుకుంటే, ఈ చిన్న ఉద్యోగములో ప్రవేశించి ఉండేవాడనేకాను. నేను ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేట్‌ను. బారిష్టరును అయినా, దురహంకారిని కాను' అని సమాధానం చెప్పారట. ఈ వాక్యంలో 'అయినా' అనే పదానికి బదులు అయినప్పటికీ అని ప్రయోగించివుంటే ఇంకా ఎక్కువ ఔచిత్యం వచ్చి ఉండేది. ఈ సమాధానం చౌదరిగారి స్వతంత్ర ప్రవృత్తిని సుతారంగా సూచిస్తుంది. 374 వ పుటలో శ్రీ చౌదరిగారు ప్రస్తావించిన పరిస్థితి యీనాటి కయినా మారలేదు. కొంతకాలంగా ఒక శాఖలో పని చేస్తున్న వ్యక్తులు, తమ శాఖలో ప్రవేశించే కొత్త అభ్యర్థులను ఈనాడు కూడా కొంచెం ఇంచుమించుగా ఇదే విధంగా తిప్పలు పెడుతూంటారు. తమకంటే అధిక విద్యావంతులూ, నిపుణులూ తమ దగ్గర పని చెయ్యడానికి వస్తే, అప్పటికే ఆ శాఖలో పాతుకుని పోయినవారు అది వారి సామ్రాజ్యం అని భావించి, కొత్తవారుచేసే పనులలో తప్పులను వెదకడం పరిపాటి. ఈ గ్రంథంలో సాంఘికమయిన సార్వజనీనత కలదనడానికి మాత్రమే యీ వాక్యాల నుదహరించడం జరిగింది.

గంజాం జిల్లాలో పనిచెయ్యడానికని వెళ్లి, ఆ శాఖ జరిపే ఉత్కళభాషా పరీక్షలో చౌదరిగారు కృతార్థులయిన పద్ధతిని చమత్కారంగా చెప్పారు చౌదరిగారు.

వ్యక్తిశీల పరిశీలన :

తనవద్ద పని చేసిన గుమాస్తాలూ, తన పై అధికారులూ, తనతో పనిచేసిన వ్యక్తులు ఎటువంటి వారయినదీ నిశితంగా పరిశీలించి, వస్తునిష్ఠంగా చిత్రించారు ఈ మేధావి. 'ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు ప్రసాదరావుగారు మంచి హృదయం కలవారు.' 398 వ పుట. 'చిన్నపని అయినను తు. చా తప్పకుండ మిక్కిలి జాగ్రత్తగా పరిశీలించేవారు. ప్రతి చిన్ని విషయం కాగితంమీద ఎక్కవలసిందే' 398 వ పుట. ఈ వాక్యలో కాగితం మీదికి అని ఉంటే స్పష్టంగా ఉంటుంది. అయినా ఇది వ్యాకరణ దోషం కాదు గదా యీ రోజులలో. అసలు సంగతి—మనశ్శీల పరిశీలనపట్ల ఈ గ్రంథకర్త శక్తిని నిరూపించుతవి ఇటువంటి వాక్యాలు. ఇంకా చాలా ఉన్నాయ్ ఇట్టి ఉదాహరణలు ఈ గ్రంథంలో. వీరి తరువాత వచ్చిన తురగా రామచంద్రరావుగారు మిక్కిలి చురుకైన మెదడు కలవారు. వారు కూడా శ్రద్ధాభక్తులతో పని చేసేవారేకాని, ప్రసాదరావుగారి వలె అంతగా స్తనశల్య పరీక్ష చేసేవారు కారు' 399 వ పుట. పైన చెప్పిన మనశ్శీల పరిశీలనా దృష్టికి వస్తునిష్ఠమయిన చిత్రణకు ఇది మరొక ఉదాహరణ. అయితే ఒక మనవి. 'మిక్కిలి చురుకైనవారు' అంటే చాలదా? 'మెదడు కల' అనవసరమేమో ననిపించుతుంది. అదేవిధంగా 'స్తనశల్య పరీక్ష' అనే బదులు శల్య పరీక్ష అంటే చాలదా ఇక్కడి సందర్భాన్నిబట్టి వాక్యం తీరు మ

బట్టీనీ. 'ఎంత స్నేహశీలిగా, విశాలహృదయుడుగా వుడినా ప్రసాదరావుగారు ఆచార పరాయణుడు' 400 వ పుట. ఆ రోజు లటువంటివి. ద్వంద్వ మనఃప్రవృత్తిగల వ్యక్తులు ఈనాడు మాత్రం ఎంత మంది లేరు కనుక.

షాకార్ జానకి, కృష్ణకుమారి, వారి తండ్రి వెంకజీగార్లతో 1949 నుంచీ శ్రీ చౌదరిగారికి పరిచయం కలదు (402 వ పుట).

పట్టణాల చరిత్ర :

గుంటూరు 2 వ సర్కిల్‌లో ఇన్‌కమ్-టాక్స్ ఆఫీసరుగా పనిచేసే రోజులలో శ్రీ చౌదరిగారు గుంటూరు తాలూకాలోని అమరావతిని చూచి వచ్చారు. అక్కడి బౌద్ధస్థూపం, అమరేశ్వరాలయం, శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి కంచు విగ్రహాలను వర్ణించారు 405 వ పుటలో. ఈ కాలపు యువకులలో ఎంతమందికి తెలుసో యీ విశేషాలు. రచయితలలో యెంతమందికి తెలుసో మరి! వీటిని గురించి ఆవేశ పూరితమయిన గేయాలు కొన్ని వెలువడిన మాట నిజమే.

ఆ తరువాత 406 వ పుటలో సత్తెనపల్లి విశేషాలను పరిచయం చేశారు. 'అయ్యా మీరు వచ్చారు, బావిలో తాడువేసి నీళ్లు తోడుకున్నారు. అంతే' అన్నాడుట ఆ గ్రామ మున్సిఫ్ (407) ఈ వాక్యం అర్థం వివరించనవసం లేదనుకుంటాను గానీ శ్రీ చౌదరిగారి నిజాయితీకిది మరొక నిదర్శనము.

ఇక ఆ తరువాత మాచెర్లగ్రామం వర్ణన. 1931 లా మాచెర్ల ఒక పెద్ద గ్రామం మాత్రమే. బ్రహ్మనాయుడి కథను, వీరభద్రస్వామి దేవాలయాన్నీ పరిచయం చేశారు. 407 వ పుటలో చరిత్ర యందాసక్తి గలవారూ చారిత్రక పరిశోధకులూ పరిశీలించదగిన అంశాలు కావా యివి ?

'క్రొత్త బిచ్చగాడు పొద్దెరుగడని అనుభవజ్ఞుడైన శ్రీ నారాయణ అయ్యంగారు పన్ను విధించిన రెండుమూడు చిన్నకేసుల్లో ఏవో కొద్ది పొరపాట్లు జరిగినవని నేను ముందువెనుక చూడక ఆ పన్ను విధింపులను మార్చి పెంచాను.' 409 వ పుట. ఇది ఈ గ్రంథకర్త నిజాయతీకి నిదర్శనలలో ఒకటి. స్తన శల్యపరీక్ష.. అనే పదాన్ని శ్రీ చౌదరిగారు ఈ గ్రంథంలో అన్ని ఎక్కువసార్లు ప్రయోగించడంలో విశేషమేమిటో ?

'సదాశయములతోనూ, వర్ణవివక్షత లేకుండా అన్ని తరగతులకు అన్ని కులాలవారిని చేర్చుకొని ఆ స్కూలు (శారదా నికేతనం) నడుపబడుచుండినా కొంత కులపక్షపాత ముండినదా అని పించింది' 411 వ పుట. ఉన్నవ లక్ష్మీనారాయణగారు గుంటూరులో నిర్వహించిన శారద నికేతనం గురించిన అభిప్రాయ మిది. ఈ రచయిత పరిశీలనా దృష్టిని సూచించుతుంది.

పాడుదేశం వెంకటస్వామినాయుడుగారి కుమారులు వెంకటకృష్ణయ్యనాయుడు, చెంగల్వరాయ నాయుడుగారలతో తమ స్నేహాన్ని 414, 415 పుటలలో వివరించారు. ఈ సందర్భంలో ఒక మనవి. 415 వ పుటలో 'సర్వసామాన్య' 'ఎలెక్షన్‌లు' అనే పదాల్ని ప్రయోగించారు. ఈ మాటలు తప్పుకాదు. లోకంలో వాడుకలో ఉన్నవే. కానీ శ్రీ చౌదరిగారి వంటి పండితులు 'సార్వత్రిక ఎన్నికలు' అని ప్రయోగించితే బాగుండి ఉండేదనుకుంటాను.

అనుభవజ్ఞు లయినప్పటికీ చిన్న ఉద్యోగాలలో పనిచేసే కొంతమంది వ్యక్తులు ఈర్ష్యతో తనపై అధికారులను ఇరుకున పెట్టాలని ఏవిధంగా యత్నించేదీ 419 వ పుటలో స్వామినాథఅయ్యర్ ఉదంతం సూచించుతుంది. ఇటువంటి వ్యక్తులు ఈనాడు మాత్రం లేరా? తమ పొరపాట్లను నిష్పాక్షికంగా భేరీజు లేసుకునే సమదృష్టి ఈ గ్రంథకర్తకు కలదని 423 వ పుటలో మదనపల్లి క్యాంపులో జరిగిన సంఘటనను వివరించిన రీతి విశదం చేస్తుంది. సాహిత్య లక్షణాలలో రీతి ఒకటి గదా.

చిత్తూరు, మదనపల్లి, వాయిల్‌పాడు, తిరుత్తణి, పుంగనూరు, కలగుండికుప్పం వంటి పట్టణాలను గురించి శ్రీ చౌదరిగారు చేసిన వర్ణనలు ఈ తరం యువకులూ, యువ రచయితలూ చదివి గ్రహించదగినట్టివిగా ఉన్నవి.

'ఒకచోట ఒక యువకుని కలుసుకొనుట తటస్థించింది. అతనితో మాట్లాడి మీరు ఏ కాలేజీలో చదువుచున్నా'రని అడిగాను. ఆయన చిరునవ్వు నవ్వి, 'నేనిక్కడి సబ్‌కలెక్టరను' అన్నాడు. 480 వ పుట,

చౌదరిగారి నిర్మొగమాటాని కొక ఉదాహరణ. అయితే యీ వాక్యంలో 'కలుసుకొనుట తటస్థించింది' అనే బదులు సంస్కృతభాషా పరిజ్ఞానంగల చౌదరిగారు కలుసుకున్నాను అనే సంపూర్తి క్రియను ప్రయోగించి ఉండవచ్చు. కలుసుకొనుట—తటస్థించింది అనుట తప్పు కాదు వ్యాకరణరీత్యా, కానీ వాక్యం ఇంపుగా ఉండాలి గదా. 'బెజవాడ కాదు బ్లేజ్‌వాడ' అన్న శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి మన్ననకు పాత్రుడయిన ఈ గ్రంథకర్త వ్రాసిన పుస్తకం గురించి మరో పుస్తకం వ్రాయాలనిపించేట్టున్నది ఈ రచనా పద్ధతి.

'దర్జాగావున్న శ్రీ రంగాచారిని వినా పేరేమిటి' అడిగినారట. తర్వాత వాడి కాబోలు 'మిస్టర్ రంగాచారి' అన్నాడు. కమీషనర్‌గారూ తనకు తానే మిస్టర్ అన్నాడని కాబోలు. కనుబొమలు పైకెత్తి హో అన్నాడు 435 వ పుట. చతుర సంభాషణలలో గర్భితంగా వుండే విమర్శను ధ్వనింపజేస్తుంది ఈ వాక్యం.

ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా 1932 అక్టోబరు 31 నుంచి 1936 మార్చి 31 వరకూ పనిచేసిన చౌదరిగారు బరంపురం విశేషాలను హృద్యంగా చూపించారు ఓపికగల పాఠకులకు. ఆనాడు ఉదయం వారు ఇండ్లు కట్టుకునే పద్ధతిని 447 వ పుటలో పరిచయం చేశారు.

'చిన్న మూలధనంతో' అని ప్రయోగించారు చౌదరిగారు 448 వ పుట 4 వ పేరాలో. 'తక్కువ పెట్టుబడితో' అంటే హాయిగా ఉంటుంది గదా? అదే విధంగా 449 వ పుటలో 'పెద్దగా వ్యాపారం చేసే వారు' అన్నారు. 'ఎక్కువగా, భారీగా' అనే పదాలలో ఏదో ఒకటి ఉపయోగించవచ్చు. 'ఏజన్సీ ప్రాంతపు గ్రామాదుల్లో' అన్నారు 452 వ పుటలో. గ్రామాదుల్లో అనే పదం వాడుకలో ఉన్నదే. కానీ వాడుకలో ఉన్నంతమాత్రాననే అది ఒప్పు అని అంగీకరించి గ్రంథస్థం చెయ్యనవసరంలేదు. గ్రామాలలో అంటే చాలు. గ్రామాదుల్లో అనగా పల్లెలూ. శివార్లూ, పెద్ద గ్రామాలవంటివన్నీ చేరుతయ్

ఆటవికులకు గంజాంజిల్లా వడ్డీ వ్యాపారస్థులు మోసంచేసిన తీరును 453 వ పుటలో యీవిధంగా వర్ణించారు ఈ గ్రంథకర్త. 'నేను నీకు ఒకరూపాయి అప్పు ఇచ్చాను కదా! కాబట్టి ఒకరూపాయ, నీవు ఒక రూపాయ తీసుకున్నావు ఇంకొక రూపాయ. మొత్తం రెండురూపాయలు' అనేవాడట.

బరంపురం వస్త్రపరిశ్రమను 453వ పుటలో పరిచయం చేశారు— అక్కడి ఇతర పరిశ్రమలను వివరించారు.

గంజాంజిల్లా విశేషాలు:

గంజాంజిల్లాలోని ఆస్కా, రసుల్‌కొండ, ఘుమసూరు, ఉదయగిరి, తిక్కాబలి, ఛత్రపూరు, సురడా, గోపాలపురం, ఇచ్ఛాపురం, బారువ, టెక్కలి, కళింగపట్నం, నేపాడ, ఫలాసా, హీరమండలం. శ్రీకాకుళం, నరసన్నపేట, పర్లాకిమిడి, మందసా, సన్నాకిమిడి (బుగడ), రంభ మొదలయిన పట్టణాల విశేషాలను యాత్రాదర్శిని వలె, భూగోళశాస్త్రంలోవలే 455 వ పుటనుంచి 491 వ వరకూ వివరించారు. ఆ వివరణలో వ్యక్తులతో పరిచయం, వారివారి మనస్తత్వం పరిశీలన జరిగినయ్. 468 వ పుట 3 వ పేరాలో 'ముట్టుకొనలేదు అనే పదం బదులు తాకలేదు అంటే ద్వంద్వార్థ దోషానికి ఆస్కారం ఉండేది కాదు. అదేవిధంగా 480 వ పుటలో తిర్రవడి అనే మాటకు బదులు ఆవేశపడిఅని లేదా నాకు కోపం వచ్చి అని ప్రయోగించివుంటే బాగుండేది. సర్వశ్రీ వరదా కామేశ్వరరావునాయుడు, నారాయణరావు పాత్రుడు, సి. నరసింహం ప్రభృతులతో తమ పరిచయ స్నేహాలతోపాటు వారివారి స్వభావాల వైవిధ్యాన్ని కూడా చిత్రించారు.

492 వ పుటలో 'ఈ కలకత్తా క్యాంపులోనే నా భార్యను డాక్టరు మేరీ షెప్పర్డు అనే వారితో తనిఖీ చేయించాను' అన్నారు. ఈ వాక్యంలో తనిఖీ

అనే పదానికి బదులు వైద్యపరీక్ష అని ప్రయోగించి వుంటే బాగుండేది. తంఖీ అనే పదం ఉపయోగించ వలసిన సందర్భాలు విజ్ఞులయిన శ్రీ చౌదరిగారికి తెలియవని ఈ వ్యాస రచయిత అపోహ పడడంలేదు. శ్రీ పర్వతనేని విరయ్యచౌదరిగారిచేత బరంపురంలో పాటకచేరీలను ఏర్పాటుచేయిం చారు ఈ గ్రంథకర్త. 500 వ పుటలో 'లోపింపచేసేవారు కాదు' అని ప్రయోగించారు. ఇక్కడ లోచేట్లు చేసేవారు కాదు అంటే బాగుండదా? అదేవిధంగా 501 వ పుటలో 'మంచిది' చూచుకుని అన్నారు 'మంచిరోజు చూచుకొని'వుంటే ఇంకా స్పష్టంగా వుంటుంది.

బరంపురం సర్కిల్‌లో శ్రీ శేషాద్రి ఐ. సి. ఎస్; శ్రీ విశ్వనాథఅయ్యర్ ఐ. సి. ఎస్. పోలీసు అసిస్టెంటు కమిషనర్ శ్రీ సుబ్బరాయన్ ప్రభృతులతో పరిచయ మయింది ఈ గ్రంథకర్తకు. ఒకరా ఇద్దరా సమకాలీనులలో ఉన్నత పదవులలో ఉన్న చాలామందితో పరిచయమయినప్పటికీ, విశేష మేమిటంటే శ్రీ చౌదరి గారు తమ వ్యక్తిత్వాన్ని కించపరుచుకొనలేదు.

రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరితో తమ తొలి పరిచయాన్ని 505 వ పుటలో వివరించారు. 506 వ పుటలో 'ఆతిధ్యం' అనే పదానికి బదులు సత్కారం అంటే బాగుంటుందేమో.

'1933 34 సంవత్సరంలో తెలుగుదేశప్పు పూర్తి వేషంలో ఉండిన శ్రీ గిడుగు సీతాపతికి 1953-54 సంవత్సరంలో నేను సూటుగా బుష్ షర్టు, లాగు వేసుకొనటం గిట్టకపోయింది. గంగి రెద్దువేషం అన్నాగనిపించింది. వక్కనున్న శ్రీ పిలం రాజు వెంకటశేషయ్యగారు చకితులై తీవ్ర అసమ్మతిని తెలిపారు. కాలమహిమా లేక వ్యక్తి కుంచిత త్వమా?' అన్నారు 507 వ పుటలో. ఈ రెండూ కాదనుకుంటాను. తనకే తెలియని అసూయ ఒక వ్యక్తిచేత అట్లా అనిపించుతుందని ఒక పాశ్చాత్య శాస్త్రవేత్త అభిప్రాయం.

దివాన్‌బహదూర్ శ్రీ బండి శ్రీహరిరావునాయుడు గారితో తన పరిచయాన్ని 509 వ పుటలో వివరించారు. 511 వ పుటలో 'నేను బరంపురం విడిచిపెట్టే సమయం దగ్గరకు వచ్చింది' అన్నారు. 'వదల వెళ్లవలసిన రోజులొస్తున్నాయ్' అని ఉంటే బాగుండేది. అయినా ఎవరిపద్ధతి వారిది! ఎవరిశైలి వారిదీ!

అనంతపురం సర్కిల్ :

అనంతపురం సర్కిల్‌లోని అనంతపురం, తాడిపత్రి, పెనుగొండ, మడకశిర, అమరావతి తదితర పట్టణాల విశేషాలనూ అక్కడపండే పండ్లనూ, అక్కడి పరిశ్రమలనూ 520 వ పుటనుంచి యాత్రా దర్శినివలె చిత్రించారు. ధర్మవరం పట్టుచీరెల పరిశ్రమను పరిచయం చేశారు. తాడిపత్రి, కదిరి, కళ్యాణదుర్గము, గుత్తి. గుంతకల్లు, పామిడి, పట్టణాల విశేషాలను పరిచయం చేశారు.

ఆ తరువాత 6-5-1940 నుంచి విజయవాడ సర్కిల్‌లో తమ అనుభవాలను పరిచయం చేశారు. విజయవాడ సమీపంలోని గొల్లపూడిలో జరిగే కోడిపందెముల విశేషాలను 582, 583 పుటలలో చిత్రించారు. గమనించదగిన వాక్యం ఒకటి. 'నేను పందెం పుంజులను పెంచడం మానినా చాలాకాలంవరకూ నాకు కోడిపందాలమీద మోజే 583 వ పుట. ఎంత బారిస్టరయినా, ఎంత పెద్ద ఉద్యోగంచేసినా యీ గ్రంథకర్త తెలుగురైతు బిడ్డగదా మరి!

విజయవాడలోని డాక్టర్లు కంభంమెట్టు విష్ణువర్ధనరావు టి. వి. యస్. చంపతిరావుగార్లతో తమ అనుభవాలను 587 వ పుటలో వ్రాశారు.

'నాకూ మంచి వయస్సు వున్నది. స్త్రీ మీద బుద్ధిలేని వాడను కాను' అన్నారు 590 వ పుటలో శ్రీ చౌదరిగారు. వారి సహజ నిష్కాపట్యానికి ఇది మరొక నిదర్శనం. అయితే 'స్త్రీమీద బుద్ధి' అనే బదులు కోరిక' అని వుంటే సందర్భోచితంగా ఉండే దనుకుంటాను.

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారితో—హైకోర్టు న్యాయమూర్తి—లా కమిషన్ అధ్యక్షులు తమ అనుభవాన్ని 592, 59[illegible], 59[illegible] పుటలలో చిత్రీకరించారు.

అప్పటి బెజవాడ సర్కిల్‌లోని కంచికచర్ల, నందిగాము, జగ్గయ్యపేట, షేర్‌మహమ్మదుపేట, కంకిపాడు, ఉయ్యూరు, వీరంకిలాకు గుడివాడ, గన్నవరం, నూజివీడు, మైలవరం, తిరువూరు, విస్సన్నపేట, ముక్త్యాల, గుడివాడ విశేషాలను 597 వ పుట నుంచి 637 వ పుటవరకూ పరిచయంచేసి ఆయా

పట్టణాలలోని జమీందారులూ, భూస్వాముల ప్రవృత్తులనూ సంప్రదాయాలనూ చిత్రించారు.

ఆ తరువాత కాకినాడ సర్కిల్‌లో తను అనుభవాలనూ, రాము కలుసుకున్న వ్యక్తుల జీవితాలనూ చిత్రించారు తరవాత నెల్లూరు, 3 వ సర్కిల్ మద్రాస్‌లలో ఉద్యోగ నిర్వహణ విశేషాలను చిత్రించారు.

హైదరాబాద్ సర్కిల్‌లోని వరంగల్లు ఔరంగాబాద్ విశేషాలను చరిత్రకాయనివలె 729 వరకూ చిత్రించారు.

'సంగీతానికి శ్రీమతి యమ్. యస్. సుబ్బులక్ష్మి, నృత్యానికి శ్రీమతి కమల లక్ష్మణ్ నా అభిమాన తారలు. సినిమా విషయంలో నాకు శివాజీ గణేశన్ నచ్చుడు. జెమినీ గణేశ్ ఫర్వాలేదు. తెలుగువారిలో కొన్ని పాత్రలలో శ్రీ ఎన్. టి. రామారావు అందరికంటే నాకు ఇష్టుడు అంటారు 762 వ పుటలో. ఈ అభిప్రాయాలలో మనం ఏకీభవించినా ఏకీభవించక పోయినా ఈ గ్రంథకర్త కళాభిజ్ఞతను సూచించుతయ్ యీ వాక్యాలు.

30—6—1953 న శ్రీ చౌదరిగారు ఉద్యోగ విరమణ చేశారు. 'బాల్యం, యౌవనం, ఒంటరిగా నున్నప్పుడు సామాజిక పరిస్థితుల ప్రోత్సాహంవల్ల సంభవించిన మొదటి భాగంలోని చర్యలను పాఠకులు పోనీలే అని సహించవచ్చును. అయితే, పెద్దవాడు, ఉద్యోగ బాధ్యత గలవాడు అట్టిచర్యలకు లోనైనాడంటే ఏవగించుకొనరా? అసలుకంటే ఎక్కువగా లేనిపోనివి ఊహించుకుని అభాండాలు వెయ్యరా?

'నే నుద్యోగం నిర్వహించిన 25 సంవత్సరాల నడివయస్సులో నేను పొత్తిగా నిష్కల్మషుడనుగా నుంటినని చెప్పలేను. కాని, ఒకటి గట్టిగా చెప్పగలను. నేనెన్నడూ ఒకరిని బాధపెట్టిగాని, ఒకరిని అన్యాయంచేసిగాని, ఒకరికి ద్రోహంచేసిగాని ఎరుగను. ఈ ధైర్యమే నా మనోశాంతికి, ఇన్ని సంవత్సరాలు ఏ మనోవ్యథలేక సుఖజీవనం చేయటానికి మూలం' అంటారు ముగింపులో. ఈ గ్రంథకర్త అదే ఈ రెండుభాగాలలోని విశేషం. మరి మూడోభాగాన్ని త్వరలో పూర్తిచేసి పెడసనగల్లులో రైతుగా తమ అనుభవాలను ఈ తరం రచయితలకూ, మేధావులకూ యువకులకూ త్వరలో అందజేస్తారని ఆశించుదాము.

—శ్రీ వి. ఎస్. అవధాని.

## భారత సాహిత్య నిర్మాతలు :

(Makers of Indian Literature)

1. డా॥ సి. ఆర్. రెడ్డి
(రచన : శ్రీ డి. ఆంజనేయులు)

2. నాజర్ అక్బరాబాదీ
(రచన : శ్రీ మహమ్మద్ హసన్.)

(ఒక్కొక్కటి 75 పేజీలు. రు. 2/50.
ప్రచురణ : సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ)

పలు భాషలతో విరాజిల్లే రమణీయమయిన ఉద్యానం, మనదేశం. ఒక్కొక ప్రాంతీయ భాషకు కళలో పాండిత్యంలో విజ్ఞానంలో నిష్ణాతులైన మణిపూసలున్నారు. వారిని లోకం తెలుసుకోవడం ఎలా? ఇందుకు ఒక్కటే సాధనం—ప్రపంచ భాష అయిన ఇంగ్లీషులో వారిని గురించి చెప్పడం.

ఈ యథార్థాన్ని గుర్తించిన సాహిత్య అకాడమీవారు మన భారతీయ సాహితీవేత్తల ప్రతిభనూ ప్రజ్ఞా ప్రాభవాలనూ ఇంగ్లీషులో చెప్పదలిచి, ఇప్పటికి ఇరవైమంది ప్రముఖుల దివ్య జీవిత చరిత్రలను ప్రకటించారు. అందులో ఇరువురు మహామహుల చరిత్రలు ఇప్పుడు మనకు పరిచయ మవుతున్నాయి— 1. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, 2. శ్రీ నాజర్ అక్బరబాదీ, ఉభయులూ అధ్యాపకులు, కవి పుంగవులు, మేధా సంపన్నులు, మించి విమర్శకులు.

విదేశాలలో విద్యాభ్యాసంచేసి వచ్చిన రామలింగారెడ్డి మైసూరు—ఆంధ్ర విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులుగా, మాతృభాషాభిమానిగా సుప్రసిద్ధులు, మన పురాణాలంటే ఆయనకు ప్రాణం, సంఘ సంస్కర్త వీరేశలింగం పంతులు ఆదర్శ గురుతుల్యుడు. 'ముసలమ్మ మరణం' ఆయన కవితా ప్రతిభకూ, 'కవిత్వ తత్త్వ విచారము' నిశిత విమర్శకూ నిదర్శనాలు. రాజకీయవేత్తగాకూడ రాణగాంచిన 'కట్టమంచి' ఆంధ్రుల హృదయంలో ఆత్మీయుడై నిత్యస్మరణీయుడైనాడు.

ఈ చరిత్ర రచించిన ఆంజనేయులుగారి మనోహర శైలి ఎవరిచేతనైనా పుస్తకాన్ని చదివింప గలదు

ఢిల్లీ ఆగ్రా ప్రాంతాలకు చెందిన ఉర్దూ మహాకవి నాజర్ అక్బరబాదీ. అనునిత్యమూ ఉత్సవ

లకూ వేడుకలకూ ఆటపట్టయిన ఢిల్లీ నగరం ఆయన కవితకు సాధన సామగ్రిని కూర్చింది. హిందూ ముస్లిమ్ కలయికను కాంక్షించే నాజర్ మన కృష్ణుణ్ణి గురించీ కవిత్వం చెప్పాడు. ఇది ప్రజాయుగమని చాటి, ప్రజా కవిగానే చెలామణి అయిన నాజర్ గేయాలను జన సామాన్యం ఉత్సాహంతో ఉత్తేజంతో ఇంటింటా పాడుకుంటారు.

కోట్లాది భారతీయుల హృదయం నాజర్ కవితలో ప్రతిబింబిస్తున్నదన్నాడు ఒక ఫ్రెంచి మహా కవి. 'ధర్మచ్యుతి అయిన ఈనాడుకూడా హాయిగా సార్థకంగా జీవితం గడపగలం' అనే సూత్రాన్ని నాజర్ కవితలో స్పష్టంగా చూస్తామని ఆయన ఎంతో మెచ్చుకున్నాడు.

భారత ప్రముఖుల యశశ్చంద్రికలను ఖండాంత రాలకు వ్యాపింపజేసే మహోద్యమాన్ని చేకొన్న సాహిత్య అకాడమీకి అభినందనలు.

## నాటక కళాకోవిదులు :

1. ధర్మవరం రామకృష్ణమాచార్యులు
రచన: డా|| పి. ఎస్. ఆర్. అప్పారావు.

2 కోలాచలం శ్రీనివాసరావు
రచన: డా. ఎస్. గంగప్ప.

(ఒక్కొక్క గ్రంథం— సాదా ప్రతి: రెండేసి రూపాయలు. లైబ్రరీ ఎడిషన్: రు. 4/– ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ, కళాభవన్, హైదరాబాదు–500004.)

అర్థశతాబ్దికిందట ఆబాలగోపాలాన్నీ ఆకర్షిం చిన ఒక నాటకం ఇప్పటికీ గుర్తువసుంది. ఆ నాటకాన్ని మళ్లీమళ్లీ చూడటం— అక్షరశక్తి చాలని పిల్లవాళ్లూ, పొలంపని చేసుకునే పాలేళ్లూకూడా ఆ పద్యాలూమట్లూ ఆహ్లాదకరంగా పాడుకుని ఆనం దించటం మరువలేము. అదే 'చిత్రనళీయం' ఇలాటి జనరంజకమైన ముప్పయి నాటకాలు రచించి, తనే నటించి, ఒక కొత్తబాణీ సృష్టించిన బళ్ళారి కృష్ణమాచార్యులకు 'ఆంధ్రనాటక కళా పితామహా' డనే బిరుదు ఏమంత పెద్దదికాదు.

'కృష్ణమాచార్యుల అభినయం, వాచికం, ఉచ్చారణచూసి నేను వారికి ఏకలవ్య శిష్యుణ్ణయ్యాను' అని తమిళనాటక పితామహుడు పి సంబందమొదలి యార్ ప్రకటించడమే చెప్పతగ్గ కితాబు. అమూల్యము లయిన ఇంత చక్కటి నాటకాలలో ఇంకా ఎదిరేడు అముద్రితాలుగా ఉండిపోయాయి. కళాభిలాషులు వీటిని వెలుగుకి తెచ్చేది ఎప్పటికో?

కృష్ణమాచారితో సమంగా కృషిచేసి నాటక రంగాన్ని ఉద్ధరించిన సమకాలికుడు 'కోలాచలం' బహుముఖ ప్రతిభాశాలి. స్వయంగా భూమికలు ధరించకపోయినా, సుమారు ముప్ఫయి నాటకాలూ ప్రహసనాలే గాక, ఆంగ్లంలో 'ప్రపంచనాటక చరిత' అనే పరిశోధక గ్రంథమూ, మరెన్నో నాటకేతర రచనలూ చేశారు. వీరి నాటకాలు హెచ్చుగా పండితా దరణ పొందాయి. ఆయన సంఘ సంస్కర్త, మంచి వక్త.

బళ్లారికి ఖ్యాతితెచ్చిన ఉభయులూ పోటా పోటీలపై నాటక సమాజాలు స్థాపించి, సంచార ప్రదర్శనలు జరిపి, తెలుగు నాటకరంగానికి గొప్ప సేవ చేశారు. వీరి రచనల్లో సన్నివేశ కల్పన, పాత్రచిత్రణ, సంభాషణా పటిమ హెచ్చుస్థాయిని అందుకున్నాయి.

నాటి తెనుగు రంగస్థలిని గురించి మరపు రాని— మరువరాని మధురస్మృతులెన్నో గ్రంథస్థం చేసి అమరత్వాన్ని కూరుస్తున్న సంగీతనాటక అకాడమీ వారి పూనిక అమోఘమైంది.

—రవి.

## భావప్రకాశనము

(మూలము : శారదా తనయ విరచితము. శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ రచించిన 'భావా లోకము' అను ఆంధ్ర వివరణముతో కూడినది. రాయల్‌సైజు పుటలు 4+12+33+733. వెల 10. రూ. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకా డమీ ప్రచురణ. ప్రతులకు—ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, కళాభవన్, హైదరాబాదు— 50000+.)

శారదా తనయ రచితమై సుప్రసిద్ధమైన 'భావప్రకాశం' సాహిత్య శాస్త్ర గ్రంథాలలో ఉత్తమ శ్రేణికి చెందినది. ఇది ప్రధానంగా రసతత్త్వాన్నీ, నాట్యతత్త్వాన్నీ తెలియజేస్తుంది. 1929 లో

బరోడాలోని గైక్వాడ్ ఓరియంటల్ సీరీస్‌లో ప్రకటించబడిన ప్రతినే ఇది ప్రచారానికి వచ్చినది.

భావప్రకాశికన్నా భావప్రకాశనమన్నా, భావప్రకాశిక అన్నా ఒకటే అని మాధవరామశర్మగారంటున్నారు. వాస్తవమే! అయినా బరోడావారు 'భావప్రకాశ' నామంతోనే దీన్ని ప్రకటించారు. గ్రంథకర్త 'భావప్రకాశనం నామ ప్రబంధ మకరోత్' అని చెప్పుట బట్టి దీనికి ఈ నామం ఉచితమయి ఉన్నది.

భరతముని నాట్యశాస్త్రమే నాట్య ప్రతిపాదక గ్రంథాల్లో ప్రాచీనం. దాని తర్వాత వచ్చిన గ్రంథం ఇదే అని తెలుస్తున్నది. రామచంద్ర గుణచంద్రులు రచించిన నాట్యదర్పణం దీని తర్వాతిదే!

ఈ గ్రంథకర్త సరస్వతీదేవి అనుగ్రహంవల్ల కలిగినాడు! అందువల్లనే ఇతనికి 'శారదా తనయు' డనే పేరు వచ్చింది. మహాప్రతిభాశాలి అయిన ఇతను వేదవేదాంగాలలో గొప్ప విద్వాంసుడు. ఒకప్పుడు శారదా దేవిని ఉపాసించుచున్న వేళ, ఆమె చైత్రమాస మహోత్సవ సందర్భంలో ముప్ఫయి రకాల రూపకాలను చూడడంలో నాట్యశాస్త్రంపై ఆసక్తి కలిగింది. నాట్యకళాధిపతియైన దివాకర పండితునివల్ల నాట్యవేదాన్ని సమగ్రంగా అభ్యసించాడు. అందులో సదాశివ-పార్వతి పరమేశ్వర-గార్గ్య-వాసుకి-వాగ్దేవి-నారదముని-అగస్త్య-వ్యాస ఆంజనేయుల మతాలను, భరతముని శిష్యుల మతాలను క్షుణ్ణంగా తెలుసుకుని ఈ నాట్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. పలు విషయాలు ఇతని గ్రంథంవల్లనే తెలుస్తున్నవి.

దీనికి ఆంధ్ర వివరణం వ్రాసిన సుప్రసిద్ధాలంకార శాస్త్రవేత్తలు జమ్ములమడక మాధవరామ శర్మగారు-శారదా తనయుడు ఇందులో చూపిన విషయాలను సంగ్రహిస్తూ

'సదాశివ వ్యాస నారదాది రసనాట్య సమాలోచకుల భావసారములను శారదా తనయుడు నిరూపించెను. భరతుని నాట్యవేద ప్రణాళికను తా ననుసరించెను. భరత విరంచాదుల వాదములను నిరూపించెను. ఆరంభమునందె భావములను ప్రతిపాదించి, అవి రసాస్వాదనమునకు సహకరించు రీతిని నిరూపించెను. భరతుడు మొదలుగా రసములనె యుల్లేఖించి, పిమ్మట భావముల ప్రతిపాదించెను. దశవిధ రూపకములను జెప్పి యవి రసభావాస్వాదనమునకు సహకరించు విధానమును సూచించెను. నటుని చతుర్విధాభినయములచే నవి సుప్రకాశము లగుటను భరతుడు ప్రతిపాదించెను. శారదాతనయుడు ఇరువది ఉపరూపకములు నుపయోగించుటను నిరూపించెను. ధనిక భోజాభినవగుప్తుల ప్రామాణ్యమును ప్రదర్శించెను. ఉపరూపకముల స్వరూప నిర్వచనములు నిరూపించి యుందలి లక్ష్యముల నిరూపించి, నాట్యోపయోగి గీతార్థము నిరూపించి తన వ్యాసంగ విశిష్టతను విశద మొనరించెను.'

అని తమ 'భావనివేదనము'లో చెప్పియున్నారు. దీనివల్ల శారదాతనయుడు వేటిని నిరూపించాడో, భరతముని గ్రంథానికీ దీనికి గల తేడా ఏమిటో సంగ్రహంగా తెలుస్తున్నది.

రచయిత సదాశివాదుల మతాలను గ్రహించినట్లు తెలుస్తున్నదే కాని, వారి గ్రంథాలేవో తెలియడం లేదు. ఆంజనేయుడు వ్రాసిన 'హనుమద్భరతం' ఒకటి ఉండినట్లూ, దానికోసం యత్నించినట్లూ శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు అంటూ ఉండేవారు. అదయినా ఇంతవరకూ లభ్యమైనట్లు లేదు.

ఈ గ్రంథం పది అధికారములుగా విభజించబడింది. వాటిలో క్రమంగా భావనిర్ణయం, రసస్వరూపాశ్రయ వృత్తి నిర్ణయం, రసభేద తత్ప్రకార స్వరూపనిర్ణయం, శృంగారాలంబన నాయక-నాయికాది స్వరూప నిర్ణయం, నాయక నాయికభేద-సత్త్వ ఉపస్థాది నిరూపణం, శబ్దార్థ సంబంధ భేద ప్రకార నిర్ణయం, నాట్యేతివృత్త పరిలక్షణాభిధానం, దశరూపక లక్షణకథనం, నృత్యభేద స్వరూప ప్రకార నిర్ణయం, నాట్యప్రయోగ భేదప్రకార నిర్ణయం వాటి వాటికి చెందిన విశేషాంశాలతో వివరించబడినవి. దీనిని బట్టి యిందులో నాట్య శాస్త్రానికీ, అలంకార శాస్త్రానికీ సంబంధించిన పెక్కువిషయాలు ఉన్నట్లు తెలుస్తుంది.

మూలగ్రంథం శ్లోకరూపంగా ఉన్నది. దానికి శ్రీ మాధవరామశర్మగారు సులభంగనూ, సంగ్రహంగానూ వివరణ వ్రాశారు. ఆయా సందర్భాల్లో ఉదాహరించబడిన కావ్య నాటకాదుల్లోని శ్లోకాలకు ఆకరాలనిస్తూ చక్కగా వివరించారు. కావలసిన స్థలాల్లో శృంగార ప్రకాశాదుల్లోని విషయాలను స్పష్టపరిచారు. ఇందులో రఘువంశ, కుమార సంభవ, మేఘ

దూత కావ్యాలనుండీ, శాకుంతలం, విక్రమోర్వశీయం, వేణీసంహారం, ఉత్తరరామచరిత్ర, మాలతీ మాధవం, రత్నావళి, నాగానందం, మహానాటకం, అనర్ఘరాఘవం, ముద్రారాక్షసం మున్నగు నాటకాలనుండీ ఉదాహరణలు గ్రహించబడినవి.

ఏతద్వివరణ రచనలోనూ, ముద్రణ నిర్వహణ లోనూ శ్రద్ధ చూపబడింది. కాని, కొద్దిచోట్ల మరి కొంత శ్రద్ధ చూపితే బాగుండేది. 321 వ పుటలో

'లాక్షాగృహానల విషాన్న సభాప్రవేశైః
ప్రాణేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య'

అని వేణీసంహారంలోని శ్లోకం ఉన్నది. ఇదే శ్లోకం లోని రెండవ పాదం 492 పుటలో

'మానేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య'

అని కానవస్తున్నది. 'ప్రాణేషు' అన్నదే సరియైనది. 'మానేషు' సరికాదు. తొందరపాటువల్లనే 'మానేషు' పడి ఉండవచ్చు. ఇట్టివి చాలా స్వల్పమైనవి.

ఈ మహాగ్రంథంలోని విషయాన్ని సంగ్రహంగా తెలుసుకుందికి గ్రంథాదిని 33 పేజీలలో 'భావ ప్రకాశనసారము' కూర్చబడినది. ఇది ఎంతో ఉపయుక్తం.

రసాన్నిగూర్చీ, భావాలనుగురించీ, నాట్యశాస్త్రాన్ని గురించీ తెలిసికొనగోరేవారు దీనిని తప్పక చదవవలసి యున్నది.

దీనిని ప్రకటించిన ఆం. ప్ర. సంగీతనాటక అకాడమీవారు, వివరణకర్త శ్రీ మాధవరామశర్మ గారును అభినందనీయులు.

## ఉదయం నా హృదయం

(వచన కవితలు. కవి : డాక్టర్ సి. నారాయణ రెడ్డి, డెమ్మీ 6+63 పుటలు ప్రతులకు—ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాదు—మద్రాసు, వెల నాలుగు రూపాయలు.)

కాలానుగుణంగా క్రమపరిణామం స్వాభావికం. అది సాహిత్యంలో బాగా చోటు చేసుకుంది. ప్రాత కవిత్వంపైని గౌరవంతగ్గి, నవ్యకవిత్వంపై మోజు హెచ్చింది. దీనికి విద్యాధికులూ ఆమోదముద్ర వేస్తున్నారు. ఆ పద్ధతిలోనే రచనలు సాగిస్తున్నారు. వారు చాలామంది యువకవులకు మార్గదర్శకులయి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అసంఖ్యాకంగా ఇప్పుడు వెలువడుతున్న నవ్య, పద్య, గేయ, వచన కవితలకు కారకులవుతున్నారు. కాని, ఎన్ని రచనలు, వెలువడుతున్నా, విద్యావేత్తల రచనలవలె తదితరుల రచనలు—పెద్దల ఆమోదముద్రను వేసుకుంటున్నా ప్రశస్తంగా కానరావడం లేదు.

విద్యావేత్తలు, విశ్వవిద్యాలయోపన్యాసకులు అయిన డాక్టరు నారాయణరెడ్డిగారు ఉదాత్తభావాలతో కవిత్వంలో క్రొత్తదనాన్ని చూపుతూ వివిధ రంగాల్లో కవితా ప్రదర్శనచేసి, అందరి ప్రశంసలనూ అందుకున్నారు. వారి గేయనాటికలు, గేయ కావ్యాలు, గేయసూక్తులు, కవితా సంపుటాలు, వచన కవితలు చాలా ప్రకటితాలయినవి వాటిలో ఈ వచన కవితం సంపుటి ఒకటి. నవీనం. 1973 లో రచించబడిన వచన కవితలు ముప్పయి ఈ పుస్తకంలో ఉన్నవి.

'ముక్కోటి గుండెలను
ముడివేసే సూత్రాన్ని
ముల్లోకాలను వడబోసే
నేత్రాన్ని.
సంప్రదాయాన్ని జీర్ణించుకున్న
ప్రయోగాన్ని'

అనే ప్రస్తావనా కవితనుబట్టి కవిహృదయం ఎట్టిదో అవగత మవుతున్నది. నేటి వచన పద్య కవిత్వంతో సామాన్యంగా కానవస్తూ వున్న విప్లవభావాలు ఈ కవితల్లో కానరావు. అరస, విరసాలకు అతీతమైన సరసకవితారీతులే ఇందులో గోచరమవుతాయి. పదాలు సరళంగా వున్నా, భావం మాత్రం సులభంగా అవగాహన కాదు. దానికి కొంత పరిశీలన, నిదానం అవసరం.

'ధరిత్రి సాగిపోతున్నా
చరిత్ర మాగిపోతున్నా
ప్రతి రోజూ పొడుస్తాయి
మృతిలేని ఉదయాలు
ఆ ఉదయమే నా ధ్యేయం
ఆ హృదయమే ఈ గేయం.'

కవి ఉదారాశయాన్ని వ్యక్తపరచడానికి ఈ కవితా ఖండికను ఉదాహరిస్తే చాలు.

## భారతీయ సంస్కృతి

(రచయిత : శ్రీ అంబటిపూడి వెంకటరత్నం ఎం. ఏ. (సాహితీ సమితి) క్రౌను సైజు 13+94 పుటలు. భారతీయ సాహితీ సమితి ప్రచురణ—వెల రూ. 2—50. ప్రతులకు: శ్రీ ఎ. వి. సుబ్రహ్మణ్య శాస్త్రి, హౌస్ నెం. 6—1—89 జి. రామగిరి, నల్గొండ.)

ప్రపంచంలోని యితర దేశాలు వస్త్రధారణం కూడా ఎరుగని అనాగరకస్థితిలో ఉన్నకాలంలోకూడా భారతీయ నాగరకత అత్యున్నత స్థితిని చెంది ఉండినది. చరిత్రాధారాలవల్లనే ఈ విషయం స్పష్టంగా తెలుస్తున్నది. కాని పాశ్చాత్య విద్యా సంపర్కంవల్ల కొందరు యువకులకు భారతీయులు అనాగరకులనీ, పాశ్చాత్యులే విజ్ఞానాది విషయాల్లో ఎంతో అభివృద్ధి పొంది, తమ నాగరకతను ప్రపంచమంతటా వ్యాపింపజేస్తున్నారనీ దురభిప్రాయపడుతున్నారు.

భారతీయ సంస్కృతి బహుపురాతనమైనదనీ, భారతీయ విద్వాంసులు బహుశాస్త్ర నిష్ణాతులై చాలా పురాతన కాలంనుంచీ మన సంస్కృతిని ప్రపంచంలోని వివిధ దేశాల్లోనూ వ్యాపింపజేశారు. ఆయా ప్రాంతాలలో పీఠాలనూ, దేవాలయాలనూ ఏర్పాటు చేశారు. ఈ విషయాలను విదేశీయులే సమ్మతిస్తున్నారు. ఈ విషయాలన్నిటినీ వివరిస్తూ శ్రీ శిశిర్‌కుమార మిత్ర "The Cultural Empire of India" అనే గ్రంథాన్ని వ్యాసరూపంగా రచించారు. దాన్ని ఆధారంగా గ్రహించి సుప్రసిద్ధ విద్వాంసులు అంబటిపూడి వెంకటరత్నంగారు 'భారతీయ సంస్కృతి' అనే యీ గ్రంథాన్ని రచించారు.

భారతీయసంస్కృతిని నలుగురికీ సాధ్యమైనంతవరకూ తెలియజేసి, దానికి విస్తృతప్రచారాన్ని కలిగించే ఉద్దేశంతో స్థాపించబడిన నల్లగొండలోని భారతీయసాహితీసమితి దీనిని ప్రకటించింది.

శ్రీ వేంకటరత్నంగారు ప్రాచ్యవిద్యలలోనే కాకుండా పాశ్చాత్యవిద్యలోనూ ఆరితేరినవారు. ఉభయ సంప్రదాయాలనూ బాగా ఎరిగినవారు. ఇటువంటి గ్రంథాన్ని రచించడానికి తగిన సామర్థ్యం ఉన్నవారు. ఆయన సులభమైన గ్రాంథికభాషలో భారతదేశంలోని బౌద్ధ, జైన, శైవ, వైష్ణవ మత సంప్రదాయాలు ఆసియాఖండంలోనూ చీనాదేశంలోనూ, ఇతరప్రాంతాలలోనూ ఎలా వ్యాపించి పరిణతిని చెందినదీ, అమెరికా మున్నగు ఇతరఖండాలలోనూ విస్తృతిని పొంది ఎలా పరిణామాన్ని పొందినదీ వివరించారు.

భారతీయసంస్కృతి పురాతనకాలంనుంచీ ప్రపంచంలో వ్యాప్తిని పొందిన విధాన్ని గ్రహించడానికి ఈ పుస్తకం ఎంతో ఉపయుక్తమైనది.

దీనిపై తమ ఉదారమైన అభిప్రాయాన్ని తెల్పిన డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు (నల్లగొండ నాగార్జునకళాశాల తెలుగుభాషాధిపతి) శ్రీ వెంకటరత్నంగారి ఔదార్యాన్నీ బహుముఖ దేశసేవనూ వెల్లడించారు.

## తిమిరంతో సమరం

(మహేంద్ర ప్రచురణ, రచయిత శ్రీ దాశరథి. డెమ్మీ సైజు 100 పుటలు. వెల 5 రూ. ప్రతులకు హైదరాబాదు—1 లోని ఆంధ్రసారస్వత పరిషత్తుకుగాని, విజయవాడ—2 లోని విశాలాంధ్ర ప్రచురణాలయానికిగాని, సికిందరాబాదు—3 ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సుకుగాని వ్రాయవలెను.)

కవితారంగంలో శ్రీ దాశరథి సవ్యసాచి. అటు సంప్రదాయ కవిత్వంలోనూ, ఇటు వచన, గేయ కవిత్వాలలోనూ పేరెన్నికగన్న విద్వత్కవి. ఏది చెప్పినా శ్రవణపేయంగానూ, హృదయానికి హత్తుకునేట్లూ రచనలు సాగించగల చాలకొద్దిమందిలో వీరొకరు. తెలంగాణ విమోచనోద్యమంలో రణరంగంలో ఉరకలు వేసిన వారికి అగ్రగామి. ధైర్యసాహసాలకు నిలయం. అందువల్లనే తిమిరంతోకూడా సమరం చెయ్యడానికి పూనుకున్నారు. వీరి ఉద్దేశం ఎంతో మెచ్చదగింది. అజ్ఞాన విలసితాలైన లోకంలోని మూఢత్వాన్నీ, మూర్ఖత్వాన్నీ, తిరోగమనాన్నీ నశింపజేసి, విజ్ఞానంతో ప్రగతిని సాధించాలనీ, ప్రబోధమూలంగా ప్రగతిని సాధించవచ్చుననీ, సమరంలో వీరుని కృపాణంవలెనే కవి హస్తంలోని కలం పని చెయ్యగలదనీ శ్రీ దాశరథి దృఢ విశ్వాసం.

ఈ విషయాలే వీరి తొలివాక్కు 'ఈ సమరం అనితం' అనేదానిలో 'దురంతమైన తిమిరంతో అనంతమైన సమరం యిది. మూఢత్వానికీ, మూర్ఖత్వానికీ, తిరోగమనానికీ తిమిరం ప్రతీక. ఈ తిమిరంలో సమరంచేసే సైనికుడు కవి. విజ్ఞానానికీ, అజ్ఞానానికీ జరిగే హోరాహోరీ పోరాటంలో మేధావి

వర్గానికి చెందిన ప్రతివ్యక్తి సైనికుడై 'పాల్గొనక మానడు'మున్నగు వాక్యాలు ముచ్చటిస్తున్నాయి.

ఇప్పుడు కోకొల్లలుగా వెలువడుతున్న విప్లవ కవితలు కూడా ఈ ఉద్దేశంతో వెలువడుతున్నవే! అయితే, ప్రబోధాంశంలోని పద్ధతులు వేరు. చాలామంది తాము కవులమని అనుకుంటారు. వారు తమ కలాలతో పోట్లు పొడుస్తారు. కాని ఈ కలానికి వున్న శక్తి వాటికి కానరాదు. మాటల్లో కాకుండా — అంటే వాచ్యంగా కాకుండా వ్యంగ్యంగానే సమాజాన్ని హెచ్చరించే శక్తివున్న కవిమాత్రమే కవి కాగల్గుతాడు.

శ్రీ దాశరథి ఉభయభాషల్లోనే — సంస్కృతాంధ్రాలలోనే కాకుండా ఉర్దూ మొదలైన ఇతర భాషల్లోనూ విద్వాంసులు. ఉభయకవిత్వాంలోనూ — అంటే సంప్రదాయ, నవ్యకవిత్వాలు రెండింటిలోనూ సమర్థులు. అందువల్లనే నవ్యకవులకున్నట్లు సంప్రదాయకవిత్వంపై ఈయనకు ద్వేషం లేదు. ఆదరమే కానవస్తుంది. తిమిరంతోచేసే యీ సమరంలో ఈయన కవిత రెండు పద్ధతులలోనూ— రెండు వైపులా వాడిగల తరవారివలె పని చేసింది.

'రావమ్మా శాంతమ్మా' అనేది మొదలుకొని, 'తిమిరంతో సమరం' అనే తుది శీర్షికవరకూ — నలభైయేసు కవితలు ఇందులో చేర్చబడినవి. ఇవన్నీ ఇదివరలో వివిధపత్రికలలో అచ్చుపడినవీ, ఆకాశవాణి ప్రసారం చేసినవిన్నీ.

'మనిషింకా అంధకార
మహోజంధి మున్నాడు
అందుకే నిశాచరుల
ఆటలు కట్టించలేడు.

................ .......................

తిమిరంతో ఘన సమరం
జరిపిన బ్రతుకే అమరం
కవితా తేజోవలయం
అవనికాంతి కిది నిలయం'

మున్నగు కవితల్లో వెల్లడి అవుతున్న భావాలతో అంగరూ ఏకీభవించవలసినవే!

ఇందులోని కవితలన్నీ అందర్నీ ఆకట్టుకొంటాయి తప్పకుండా.

'తిమిరంతో సమరంచేసే మహావీరుడికి సహాయంగా 'కాంతి కవాటాన్ని తెరచి, అతని పోరాటం నిరాఘాటంగా సాగడానికి దోహదమిచ్చిన విద్వత్కవి విమర్శక వతంసులు విద్వాన్ విశ్వంగారున్నూ, దాశరథి గారితోపాటు అభినందించదగినవారు!

—''అంగీరస''

## భారతీయ కళాపరిణామ చరిత్ర

(కళ—ఆరవ సంపుటి. వెల రు. 5 — సంపాదకుడు : శ్రీ చలసాని ప్రసాదరావు. ప్రాప్తిస్థానం : భారత కళాపరిషద్, 70 2 R. T. ప్రకాశం నగర్, హైదరాబాద్—16.)

ఈ సంపుటిలో సంపాదకులు శ్రీ చలసాని ప్రసాదరావుగారి ప్రవేశిక, శ్రీ పి. ఆర్. రావుగారి ఆరవ మజిలీతో కలిపి మొత్తము 13 వ్యాసాలు పొందుపరచారు.

మనదేశంలో ధనిక శ్రామికవర్గ పోరాటములతో సంబంధములేని కళలు ముందు ముందు వస్తాయని నేటి ప్రజలు కలలు కనాలి. గతమంతా మరకలుషితము దోష భూయిష్టము—దేముడు లేడు—దెయ్యము లేదని-వర్తమానము—భవిష్యత్ అంతా మన చేతులోనే ఉందనుకోవడము ఒక విధంగా మంచిదే. దానివల్ల ప్రజల స్వశక్తి విజృంభించవచ్చు. శ్రామిక వర్గము అనగా శిల్పులు చిత్రకారుల ఆర్థిక పరిస్థితి బాగుపడవచ్చును. ప్రజలుకూడా సుఖపడవచ్చును.

కాని త్రిదోష రహితమైన లిప్తలిగవంటి మానవ సమాజము ఒకటి ఎప్పటికైనా ఏర్పడితే పరవేశన పరాయణత్వము నమసిపోయి ఉదాత్తమైన లలిత కళలు ఉంటాయని ఆశించవచ్చు. లోకంలో అందరు ఎరిగిన సామెత ఒకటి ఉంది. అది 'అందరికి నేను లోకువైతే నాకు నంబి కొండయ్య లోకువ' అని. మానవ సమాజము కళలు ఆ సామెతకు దిగజారకుండా ఎప్పటికప్పుడు అంతా జాగర్త పడాలి.

మరో ముఖ్యవిషయము ఏమిటంటే గతంలో విభిన్న మతాలు సమస్త లోకకల్యాణముకోసము ప్రయత్నించాయి. వాటి పెరుగుదలకోసము కొంత అనివార్యమయిన రక్తపాతము జరిగిందని ఆనాటి మంచి నంతటిని నేటి చారిత్రిక పరిశీలకులు తొలగించలేరు. కళల గౌరవాన్ని పాడిగించనులేరు. మృతుడైన వానిని తిట్టి నిరసిస్తే ఎంత ప్రయోజనము ఉంటుందో మత వ్యాప్తికోసం జరిగిన చెడ్డను నేడెంత విమర్శించినా అంతే ప్రయోజనము ఉంటుంది. నేటి ప్రజానీకము ఆనాటి చెడుగును విస్మరించి మతాల్లోని మంచిని

కమ్మని లలితకళలను పోగుపోసుకుని పురోగమించుటకు ప్రయత్నిస్తోంది కదా!

ఒక విధంగా నేటి సాంఘిక వృక్షము పెరుగుతోంది. ఆ కొమ్మ వంకరగా ఉంది ఈ కొమ్మ వంకరగా ఉందని తొలగించడము ప్రారంభిస్తే మానవ సమాజానికే దెబ్బ కదా! ప్రజలు శాస్త్రదృష్టికి—చరిత్రకు విమర్శకు విముఖులై ఏ కాలము ఒక్కలాగే ఉండరు. అంత దృష్టితో మారుతూనే ఉంటారు.. నూతన యుగకర్తలు జన్మించినపుడల్లా ఆయా మార్పులు శతాధికంగా జరుగుతాయి.

సామ్యవాద సిద్ధాంతాలు గొప్పవే. వాటిని దేశాను గుణ్యంగా మలుచుకొనడంలో ఉంది నేర్పు. ప్రస్తుతము ఏ ఏ దేశాల్లో సామ్యవాదము అమల్లో ఉందో ఆయాదేశాల శిల్ప చిత్రకళలు ఏదేశాల్లో పనిచేస్తున్న శిల్పుల్ని చిత్రకారుల్ని తమ తమ వలయాల్లోకి లాక్కోగలిగే అంతటి శక్తివంతంగా కనిపించవు. ఆయా దేశాల్లో కళాకారులకు తగినంత స్వేచ్ఛకూడా లేనట్లు దైనందిన వార్తలవల్ల మనకు విశదమే.

ప్రస్తుతము మన దేశంలో యంత్రయుగ స్థాపన జరుగుతోంది. ఆ విధంగా సంఘంలో శ్రామిక వర్గము సంఖ్య పెరుగుతోంది. అదలా ఉండగా మానవ సమాజము కూడా ఒక విచిత్రమయిన యంత్రము మామూలు యంత్రాలు ఒకదాన్ని ఇంకొకటి దోచుకోవు. యంత్ర భాగాలు విరిగిపోతే వాటి స్థానంలో కొత్తవి వస్తాయి. నట్లులు స్క్రూలు ఎక్కడ ఉండవలసినవి అక్కడ ఉంటాయి.

కాని మానవ సమాజ యంత్రంలో మనుష్యులు ఎవరి పనులు వారు సరిగా నిర్వర్తించరు. వర్గ సంఘర్షణలు అనే పేరుతో మానవసమాజ యంత్రము ఆగుతూ కుంటుపడుతూ — ఒక్కొక్కసారి మృత ప్రాయముగా కూడా తయారవుతుంది. ఇదంతా చూడగా చూడగా ప్రచారాలతో ఏవిధమయిన సంబంధము లేకుండా శిల్పచిత్ర కళలను వాటి మానాన్ని వాటిని బ్రతుకనిస్తే బాగుండునని తోస్తుంది.

గతంలో ఆవిర్భవించిన లలిత కళలు చాలా గొప్పవని అంతా ఏకగ్రీవంగా ఒప్పుకుంటారు. కాని వాటిని పెంచి పోషించిన మతాలు, ప్రభువులు, సోమరులని—సంఘ ద్రోహులని అంటారు. అదంతా విచిత్రమయిన వాదన. ఏ కొత్త రాజకీయ సిద్ధాంతాన్ని కళలనెత్తిని రుద్దడానికే తొందరెందుకు?

ఈ రోజుల్లో శ్రామికవర్గాన్ని దోచుకోవాలని ఎవరు అనరు. శ్రామికులకు ఎంతపని—ఎంత వేతనము—ఎంత విరామము ఇవ్వాలో అంతా ఇస్తూ వారు దేశంలోని విద్యల్ని లలిత కళల్ని అర్థం చేసుకుని చూచి ఆనందించే పరిస్థితులు ఏ దేశాని కాదేశమే కల్పించాలి. వచ్చేమార్పులు శాంతియుతంగా రావాలి. అన్నివర్గాలవారు సుఖంగా ఆ మార్పుల్లో ఇమిడిపోవాలి. అంతేకాని రామాయణ మహాకావ్యాన్ని విదేశీయులు కేవలము చారిత్రక దృష్టితో చూచినట్లు మనవాళ్లు చూడడము హాస్యాస్పదము. ఆ విధమైన వ్రాతలు నిష్ప్రయోజనము.

కాగితము కరువు కాలంలో వ్యయ ప్రయాసల కోర్చి భారత కళాపరిషత్తువారు ఆదర కళా కుసుమాన్ని ప్రజానీకానికి సమర్పించుట ముదావహమయిన సంగతి. ఆరవ సంపుటి చరిత్రకు సంబంధించినది కనుక స్వల్పంగానయినా శిల్ప చిత్ర కళల మార్పులకు చెందిన బొమ్మలు ప్రచురించి ఉంటే ఈ పుస్తకము ఇంకా సర్వాంగసుందరంగా ఉండేది. కళలతో పరిచయము లేని సామాన్యమయిన ప్రజలకు చారిత్రిక స్వరూపాన్ని అవగాహన చేసుకుందుకు ఆ బొమ్మలు ఎంతైనా తోడ్పడేవి. రేపటి చిత్రములో పుస్తకపు వెలుపలి కాగితం బాగుంది. ఎవరెత్తుకుంటే వారి వంకనే చూర్చునే చిత్రకారులే లోకంలో ఎక్కడ చూచినా కనిపిస్తారు. ఉదరం కోసం చేతులు చాచుతారు. వారిని మాత్రము ఎవరేమి అనగలరు.

—శ్రీ పింగా లక్ష్మీనరసింహామూర్తి.

## హస్తసాముద్రిక సర్వస్వం

(రచన: 'శార్వరి', ప్రచురణ: శార్వరి పబ్లికేషన్స్, 68, అమ్మన్‌కోవిల్ వీధి, కోడంబాకం, మదరాసు—24. క్రౌన్ 1/8 సైజులో 264+8 పుటలు, ధర: రూ. 10.)

మానవుడు నాగరకత పెంపొందించుకొన్నకొద్దీ, అతని ఆలోచనలు కూడా పెంపొందాయి. 'భవిష్యత్తు' మానవుణ్ణి కలవరపెట్టింది. 'రేపు'ను రూపొందించుకొనే ప్రయత్నాలతోపాటు 'రేపుకు రూపం' ఏమిటో కనుక్కొనే ప్రయత్నమూ చేయసాగినాడు. ఫలితంగా జ్యోతిషశాస్త్రం, హస్తసాముద్రికం, సంఖ్యా శాస్త్రం వంటి విధానాలకు రూపకల్పన జరిగింది. జాతకాలను

బట్టి, చేతులమీది రేఖలనుబట్టి, పుట్టిన తేదీల లెక్కలనుబట్టి భవిష్యత్తులో మనుష్యులు ఏమవుతారో, ఎట్లా ఉంటారో చెప్పడానికి వీలుఉన్నదనగానే ఆయా విధానాలపట్ల ప్రజాదరణ కూడా పెరిగింది.

ఒక 'హస్తసాముద్రికం' గురించి ఇన్ని పుటల పుస్తకం వ్రాయడానికి వీలుకలిగిందనే విషయాన్నిబట్టి ఈ విధానం ఎంతగా విస్తరించిందో, ఈ విధానానికి ప్రజలలో ఎంత పలుకుబడిఉందో గ్రహించవచ్చు. హస్తసాముద్రికాన్ని శాస్త్రమనాలా, లేక కొన్ని అభిప్రాయాంతో రూపొందిన విధానం అనాలా అనేది వివాదాస్పదమైన ప్రశ్న. శార్వరి వ్రాసిన 'హస్తసాముద్రిక సర్వస్వం' అనే ఈ పుస్తకం చదివిన తర్వాత, హస్తసాముద్రికాన్ని కొనడం తప్పుకాదనిపిస్తుంది.

'హస్తసాముద్రిక సర్వస్వం' అనే ఈ పుస్తకం పేరుకు తగిన పుస్తకం. ఇన్నాళ్లుగా హస్తసాముద్రికం గురించి ప్రాచుర్యంలో ఉన్న ప్రాచ్య పాశ్చాత్య పుస్తకాలలో కనిపించే విషయాలతోబాటు, వాటిలో లేనివి కూడా ఇందులో కనిపిస్తాయి. ఆ విషయాలు ప్రయోగాత్మకంగా పరిశీలించినపుడు సత్యసమ్మతంగా ఉండడం 'శార్వరి'కి 'హస్తసాముద్రికం'లో గల ప్రతిభకు గుర్తు.

వివిధ హస్తాలు, ఆయా హస్తాలలోని వ్రేళ్లూ, వ్రేళ్ల మధ్యభాగాలు, పర్వాలు, గోళ్లు, గోళ్లలో గీతలు, క్షేత్రాలు, రేఖలు మొదలైన వివిధ అంశాల గురించి చక్కగా వివరించారు రచయిత. హస్తసాముద్రికంపట్ల అభిరుచి కలవారు, హస్తసాముద్రికం చెప్పడం వృత్తిగా పెట్టుకొన్నవారు తప్పక చదవవలసిన పుస్తకం ఈ 'హస్తసాముద్రిక సర్వస్వం'.

## నాటక లక్షణములు

(రచయిత్రి : శ్రీమతి ముదిగంటి సుజాతా రెడ్డి, లెక్చరర్, ఆర్. బి. వి. ఆర్. ఆర్. మహిళా కళాశాల, నారాయణగూడా, హైదరాబాదు. క్రౌన్ $\frac{1}{8}$ సైజులో 84+8 పుటలు. వెల : ఒక రూపాయి)

కళాశాలలలో తెలుగు చదువుకొనే విద్యార్థులకు ఉపయోగపడవలెననే ఉద్దేశంతో రచయిత్రి ఈ గ్రంథంలో నాటక లక్షణములను గురించి వివరించే ప్రయత్నము చేసినారు.

ఈ గ్రంథం పది అధ్యాయాలలో విస్తరించింది. మొదటి అధ్యాయం 'నాటకముల చరిత్ర'లో నాటకాల ఉత్పత్తి వికాసాలను వివరించి, సంస్కృతాంధ్రాలలోని ప్రసిద్ధ నాటకకర్తలను పేర్కొన్నారు రచయిత్రి. రెండవ అధ్యాయంలో 'రూపక భేదములు' అనే శీర్షికక్రింద దశవిధ రూపకాల లక్షణాలను, ఉపరూపకాలనూ ఉదాహరణలతో వివరించారు. నాందీ ప్రస్తావనల గురించి మూడవ అధ్యాయంలో పేర్కొన్నారు. నాలుగవ అధ్యాయంనుండి ఏడవ అధ్యాయంవరకు అంక స్వరూపాన్ని; సూచ్యవస్తు సూచనకోసం ప్రయోగించే విష్కంభం మొదలైన అర్థోపక్షేపకాలను; బీజాది అర్థప్రకృతులను; ఐదు కార్యావస్థలను, వాని సమ్మేళనంవల్ల ఏర్పడే ఐదు సంధులను, సంధ్యంగాలను; నాటకాన్ని మంగళాంతం కావిస్తూ కావ్యోపసంహారప్రశస్తి పూర్వకంగా ఉండే భరత వాక్యాన్ని వివరించారు. ఎనిమిదవ అధ్యాయంలో నాయికా నాయక భేదాలను, వారి సాత్త్విక గుణభావాదులను వివరించడానికి పూనుకొన్నారు. తొమ్మిదవ అధ్యాయంలో విదూషక.పాత్రగురించి విపులంగా చర్చించారు. పదవ అధ్యాయంలో రసస్వరూపం గురించి వివరించారు.

ఇటువంటి పుస్తకాలు విద్యార్థులకు ఉపయోగపడుతాయనే విషయం గురించి సందేహం ఏమీ లేదు. అయితే ఈ పుస్తకం చదివినప్పుడు నిరాశ కలిగింది.

ఒక పుస్తకం వ్రాసిన రచయిత్రి ఒక కళాశాలలో అధ్యాపకత్వం నెరపుతున్నట్లు పుస్తకం ముఖపత్రాన్నిబట్టి తెలుస్తున్నది. అధ్యాపకత్వం నెరపుతున్నవారు తమ విద్యార్థులకు మార్గదర్శకులు కావలసినవారు. వారే తమ మార్గంలో తొట్రుపడితే, విద్యార్థుల సంగతి చెప్పనక్కరలేదు.

ఈ పుస్తకంలోని కొన్ని వాక్యాలు చదివినపుడు ఎంతో బాధ కలిగింది. తెలుగులో శాస్త్రీయ గ్రంథాలు వ్రాస్తున్నవారే ఇటువంటి వాక్యరచన చేయడం దుస్సహమైన విషయం. కొన్ని ఉదాహరణలు పరిశీలిస్తే విజ్ఞులు నా మాట కాదనరనుకొంటాను :

'భరతులను వారిద్దరు గలరని విమర్శకుల యభిప్రాయము. అది భరతుడు లేక వృద్ధభరతుడు మరియు కేవలము భరత నామధేయుడు.' (పుట 3)

'ప్రకరణమున నాయిక కులీనురాలైన స్త్రీయైన లేక వేశ్య ఎనితయైన యుండును.' (పుట 13)

'పాశ్చాత్యుల దుఃఖాంత (Tragedy) వంటి

నాటకములు సంస్కృతమున వ్రాయబడలేదు.' (పుట 10)

'నటి సూత్రధారుని భార్యయై యుండును. మారీషుడు, పారి పార్శ్వకుడు బావమఱిది యగుదురు.' (పుట 23) [మారిషుడు మారీషుడు అయినా ఫరవాలేదుకాని మారిష పారిపార్శ్వకులు పరస్పరం బావమరదులో, సూత్రధారుని బావమరదులో మనకు స్పష్టంగా తెలియకపోవడం విచారకరం.]

'నాటకమున నాయకుడు...కులీనుడు, స్థిర చిత్తుడు, యువకుడూ యైయుండవలెనని లాక్షణికులు చెప్పిరి.' (పుట 46)

ఈ పుస్తకంతో అచ్చు తప్పులు కుప్పలుతెప్పలు. శాస్త్రగ్రంథాలలో తప్పులు దొర్లితే కలిగే ఇబ్బందులు ఎన్నో. ఈ పుస్తకం అందుకు నిదర్శనం. రచయిత్రి శైలిలో వైవిధ్యం ఎక్కువగా కనిపిస్తున్నది.

ఈ పుస్తకానికి 'ఆధునికాంధ్ర సాహిత్యాచార్యులు' దివాకర వేంకటావధానిగారు 'ముందుమాట' వ్రాశారు.

—శ్రీ పి. ఎస్. గోపాలకృష్ణ.

## దాదర్ వంతెన—పిల్లలు

(మూలం: కిషన్‌చందర్, అనువాదం: జా నేంద్ర, $\frac{1}{4}$ క్రౌన్ సైజు, 86 పే.+105 పే, వెల: రూ. 6. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2.)

కిషన్‌చందర్ తెలుగువారికి కొత్తగా చెప్పుకోవలసిన రచయిత కాకపోయినా, గొప్పగా చెప్పుకోదగ్గ పొరుగు రచయితల్లో ఒకరు. ఒక ప్రతిభావంతుడైన రచయిత ఒక భాషకే పరిమితంకాదు. అతడ్ని అన్ని భాషలవారూ అనువదించి తమ సొంతం చేసుకుంటారు. శరత్ సాహిత్యాన్ని ఏ అకాడమీవారు అనువదించారు? అట్లాగని శరత్ సాహిత్యం ఏ భాషలో లేదు? మన మట్టుకు మనం శరత్ తెలుగు రచయితే అని కొంత మంది నమ్మేదాకా అతని సాహిత్యాన్ని మన సొంతం చేసుకోవడమేకాదు అతని పేరునూ మన బిడ్డలకు పెట్టుకునేదాకా శరత్ అంటే ప్రేమనేకాదు, పెద్ద వ్యామోహాన్నే పెంచుకున్నాము. కిషన్‌చందర్ ఉర్దూ రచయిత అయినా అన్నిభాషల్లోనూ ఆయన రచనలు లభించి, భావాలు వ్యాపించి భారతీయ రచయిత అన్న కీర్తి నెప్పుడో గడించాడు.

'దాదర్ వంతెన—పిల్లలు' అన్న ఈ రచన 'దాదర్ పుల్‌కెబచ్చే' అన్న ఉర్దూనవల కనువాదం. ఈ పుస్తకంలోనే 'అధోముఖ వృక్షం' అనే మరొక నవలిక కూడా ఉన్నది.

'దాదర్ వంతెన—పిల్లలు' నవలతో మనకు పరిచితమైన వాతావరణంలో అపరిచిత పాత్రల పరిచయం జరుగుతుంది. 'అధోముఖవృక్షంలో' అపరిచిత వాతావరణంలో పరిచిత పాత్రల పరిచయం జరుగుతుంది.

భగవంతుడు మానవావతారమెత్తి అంటే పిల్లవాని రూపంలో వచ్చి తన సృష్టిఅయిన ఈ లోకం పోకడలను సమీక్షించడం 'దాదర్ వంతెన-పిల్లలు'లో వస్తువు. రచయిత కూడా ఇందులో పిల్లవాడుగా అవతరించి భగవంతుడికి 'గైడ్'గా వ్యవహరిస్తాడు.

ఈ కథా వస్తువంతా బొంబాయిని కేంద్రం చేసుకుని నడుస్తుంది.

నవల చివర నవలకంతా ఆయువు పట్టులైన (భగవంతునికీ రచయితకీ జరిగిన) సంభాషణ పరిశీలించదగ్గది.

'ఏం, పిల్లలతో మీకింకా తనివి తీరలేదా?' (అని రచయిత భగవంతుని అడుగుతాడు)

'లేదు. ఎవణ్ణయితే చూడాలని నేను వచ్చానో, ఆ పిల్లవాడు నాకింకా దొరకలేదు...ఇవాళ ఆఖరి దినం. బహుశా ఇవాళ దొరకవచ్చు'

'ఆ పిల్లవాడు మీకు బహుశా బొంబాయిలో దొరకడు...ఆ పిల్ల వాడెక్కడున్నాడు? వానిని నేను మీకెలా చూపించగలను? మీరెంత అమాయకులు, భగవాన్! శుద్ధి అనే ప్రతిబింబాన్ని మీరు మీ హృదయంలో దాచుకొని వచ్చారే అది మా సమాజంలో వుండడమే అసంభవమైనప్పుడు మా జీవనంలో ఎక్కడ లభ్యమౌతుంది మీకు?' ఒక్క పవిత్రత మేనా (?) వుండేది మీవద్ద? మీ పిల్లవాడు! అతడొక్కడే జాతికి అమాయకమైన పెన్నిధి ఔతాడు... దాని పిల్లవాడు...మీరు ఎందుకు దానికి కళంకం తెచ్చిపెడుతున్నారు?' (ఈ వాక్యాలిట్లాగే ఉన్నాయి పుస్తకంలో! కొన్నింటికి అర్థమేమిటో మనకర్థం కాదు.)

'మూలధనాన్ని లోకులు వడ్డీకి ఇచ్చుట లేదా? దానిమీద వారు లాభం పొందటం లేదా? మరి పిల్లల్నికూడ మేము బొంబాయితో లాభమనే చక్రా

నకి బంధిస్తే మీ రాశ్చర్య పడటం దేనికి? మీ స్వర్గానికి తిరిగి వెళ్లిపొండి. మీకా పిల్లవాడు ఇక్కడ దొరకడు!'

ఈ మాటలే నవలకు భరత వాక్యాలవంటివి.

అయితే నవల ఇంకా ఎనిమిది పేజీలు సాగుతుంది. తర్వాత వీరిద్దరికీ ఒక భిక్షగాళ్ల ముఠాతో పరిచయం కలుగుతుంది. భగవంతుడు చూడాలని కోరుతున్న పిల్లవాడు అక్కడైనా లభిస్తాడేమోనని వీరి ఆశ. ఆ ముఠాలో చేరాలంటే అంగ లోపం ఉండాలి. వీరిద్దర్నీ తమ ముఠాలో చేర్చుకోవడానికి ఆ ముఠా నాయకుడు 'దాదా' పిల్లల రూపంలో ఉన్న భగవంతుడికి కళ్లు పీకించమనీ, రచయితకు కాళ్లు విరగొట్టమనీ గూండాలకు ఆజ్ఞాపిస్తాడు. వీరిద్దరూ తప్పించుకొని పారిపోవడానికి ప్రయత్నిస్తారు. గూండాలు భగవంతుడ్ని పట్టుకుని కొలిమిలో కాల్చిన ఎర్రని ఇనుప కడ్డీలతో రెండు కళ్లూ పొడిచేస్తారు. సరిగ్గా అదే సమయానికి ఆ దృశ్యాన్ని చూడలేక కళ్లు మూసుకున్న రచయితకు బాధతో కూడిన ఓ కంఠధ్వని వినిపించింది—'నేను చూచేశా...నేను చూచేశా...!' అని.

ఇది పిల్లలను ఆనందింపజేసే నవల మాత్రమే కాదు, పెద్దల్ని ఆలోచింపజేసే వ్యంగ్య హాస్యరచన.

కాల్పనికమైన వస్తువుతో అనుభవాన్ని వ్యంగ్యంగా విమర్శించే నవలా ప్రహసనం 'అధో ముఖవృక్షం.'

నిరుపేద యూసుఫ్ యిందులో నాయకుడు. రాజు యూసుఫ్ పూలతోటను, రాకుమారి అతన్ని (మంచినీటి)బావిని ఆక్రమించుకోగా, మిగిలిన ఆవును అమ్మి పొట్టపోసుకోవాలనుకుంటాడు. ఆవును గ్రామ గ్రామపెద్దకు బేరం చేస్తాడు. గ్రామపెద్ద మూడు రూపాయిలు, మూడు విత్తనాలు చూపించి—'ఇవి ఇంద్రజాలికమైన విత్తనాలు. మూడింటినీ ఒకేసారి ఎత్తితే, వాటినుండి ఒక వృక్షం పుట్టి, ఆకాశమంత ఎత్తు పెరుగుతుంది. ఆవు ఖరీదుగా మూడు రూపాయిలు కావాలా? మూడు విత్తనాలు కావాలా?' కోరుకొమ్మంటాడు. యూసుఫ్ విత్తనాలు తీసుకువచ్చి విత్తబోయే సమయంలో రెండు విత్తులు పక్షులు ఎత్తుకుపోతాయి. ఖిన్నుడై మిగిలిన ఒక విత్తు నాటుతాడు. ఆ రాత్రి తుఫానులో విత్తినచోట పిడుగుపడి, భూమి వయ్యారై పెద్ద సొరంగ మేర్పడుతుంది. ఆ సొరంగంలో విత్తు మొలిచి, పెద్దవృక్షమై తల కిందులుగా పెరిగిఉంటుంది. యూసుఫ్ ఆ చెట్టు బోదె పట్టుకుని పాతాళంవైపు పయనిస్తాడు. ఆ ప్రయాణంలో అతనికి అనేక చిత్ర విచిత్రాలు ఎదురవుతాయి. ఫిలిం డైరెక్టర్ల గుడ్ల గూబలూ, నల్లరాక్షసుడూ; యంత్రాల నగరం, మాంత్రికుడూ, ప్రవక్తవంటి వృద్ధుడూ, సులేమాన్ టోపీ, ఎగిరే దండమూ మొదలైన ఎన్నో విచిత్రాలు కనిపిస్తాయి.

'కాని బాబా నేనీ చెట్టును పూర్తిగా ఎక్కలేదు'. అని యూసుఫ్ అంటాడు—

'నేను దాని కొసను చూడలేదు. దాని కొసను చూడాలని నాకు మెండగు కోర్కె వుండినది.'

వృద్ధుడు మందహాసంచేసి అన్నారు: 'పుత్రా, యిదేమీ సామాన్యమైన వృక్షంకాదు. ఇది మానవాభ్యుదయమనే వృక్షం. దీని కొసను నేటివరకూ ఎవ్వరూ చూడలేదు.

ఈ మాటలు ఈ నవలిక పేరులోని అంతరార్థాన్నీ, ఉద్దేశ్యాన్ని మనకు వ్యక్తం చేస్తున్నది.

ఈ రెండు నవలలను 'జ్ఞానేంద్ర' అనువదించారు. 'అత్యంత చెడ్డతిట్లు' 'అమిత చురుకుగా' మొదలైన విడ్డూర ప్రయోగాల విషయం అలా వుంచినా, మిగతా రచన కూడా ఇది అనువాదం అనే సంగతి మరపించ లేకపోతున్నది. ఆదినుంచి మనది అనువాద సాహిత్యమే అయినా, అనువాదాన్ని అనువాదంగా రాయటంకానీ, అనువాదాన్ని అనువాదంగా చదవటంగానీ—అలవాటులేని జాతి మనది. రెండు నవలలనుంచి పైన ఉదహరించిన కొన్ని సంభాషణలనే ఈ అనువాదకుని రచనా ధోరణికి ఉదాహరణగా గ్రహించవచ్చు.

—శ్రీ నూతలపాటి.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thamdu chetty Street,
Madras 600001. Editor: S. Radhakrishna.


నళినశ్రీ కళానిలయం (కాకినాడ) సమర్పించు
నళినశ్రీ ప్రొడక్షన్స్
నిత్యసుమంగళి
నిర్మాత.దర్శకుడు. బి.యస్.ఆర్
కథ ఆర్.కె.ధర్మరాజ్ మాటలు.విజయరత్నం సంగీతం యస్.రాజేశ్వరరావు పాటలు దాశరథి.కొసరాజు
కెమెరా.వి.యస్.ఆర్ కస్తూరావు ఆ.రాజేంద్రకుమార్.. ఎడిటింగ్.అంకిరెడ్డి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ ఎమ్.రామారావు

Bharati October 7 th 1974 Regd. No. M. 1856

# అమృతాంజన్ లిమిటెడ్

## 75 సంవత్సరాల పైగా గృహౌషధములు తయారుచేస్తున్నవారు!

- అమృతాంజనం బాధానివారిణి
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంట్
  తామర, శీబ, గజ్జి వగైరాలకు,
- అమృతాంజన్ ఇన్‌హేలర్
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.
- అనోలియమ్-కోల్డ్ రబ్
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- శాలోఫెన్ -బాధానివారిణి మాత్రలు
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు




BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M114 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 71 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI, II, IV, |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |